శ్రీశుభమస్తు-అవిఘ్నమస్తు.

శ్రీపంచముఖవీరహనుమా[illegible]

# ప్రహ్లాద:

## నాటకభజనకీర్తనలు



గ్రంథకర్త:

బళ్లరామరాజు.

1931.

 [వెల 0—12—0.

# కుశలవ

## భజనకీర్తనలు.

నవరస పూరితములైన చక్కనికీర్తనలతో నిండియున్నది. శైలి కడు మృదుమధురము. ఆయిదవకూర్పునకు సిద్ధముగానున్నది. త్వరపడినగాని ప్రతులుదొరకవు. వెల రు 0—8—0

# రామదాసు

## భజనకీర్తనలు.

భక్తిరస ప్రధానములగు చక్కనికీర్తనలతో నిండియున్నది. దశావతారములు. అనుగుకీర్తనలిందు పొందుపరచితిమి త్వరపడినగాని ప్రతు దొరకవు. వెల 0—10.

---

వలయువారు,—బళ్ళ రామరాజు, తాపేశ్వరం,
రామచంద్రపురంతాలూకా, గోదావరిజిల్లా.

శ్రీ

శుభమస్తు-అవిఘ్నమస్తు.

శ్రీపంచముఖీ హనుమద్గురవేనమః

# ప్రహ్లాద.

## నాటకభజన కీర్తనలు.





గ్రంథకర్త:

బల్లి రామరాజు.

మొదటికూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరమున

శ్రీరామాప్రెస్సునందు ముద్రింపబడియె

1931



[వెల 0—12—0

# ఉపోద్ఘాతము.



పండితాగ్రేసరులారా

మత్ప్రణీతంబగు కుశలవ, రామదాసు, సత్యహరిశ్చంద్ర భజనకీర్తన లిదివరలో జగత్ప్రసిద్ధమైయున్నవి. భక్తిరసపూరితంబగు భగవంతుని పుణ్యచారిత్రంబు పలుతెరంగుల, నిరర్గళ సహజవాగ్ధోరణి, జూపుచునభివర్ణించి, కవీంద్రులనేకు లాంధ్రభాషావధూటి నలంకరించి యున్నారు.

బాల్య కౌతూహలంబున నాయసమర్థత వెల్లడించితిని. క్షీరోదకన్యాయంబుగా నిందున్న దోసంబుల గణింపకమన్నింప సర్వజ్ఞులు ప్రార్థితులు.

ఇట్లు బుధజనవిధేయుడు,

బళ్ల రామరాజు



# ఇందువచ్చు పాత్రలు.

## పురుషులు.

హిరణ్యకశిపుడు—కథానాయకుడు.

శంబరుడు, శకుని } మంత్రులు.

దండనాయకుడు.

నారదుఁడు.

దేవేంద్రుఁడు.

బ్రహ్మ.

విష్ణువు.

జాబాలి, గాలవుడు } మునులు.

వజ్రకంఠుడు, మందపాలుడు } సేవకులు.

ప్రహ్లాదుడు.

చాముడు—బడిపంతులు.

సుందరం, కరాళం, సూరిగాడు, నాగన్న, మొద్దాబ్బాయి } బడిపిల్లలు.

పాములవాడు.

నృసింహమూర్తి.

## స్త్రీలు.

లీలావతి—కథానాయిక.

విద్యుద్దీప్తి—చెలికత్తె.

లలిత—దాసి.

ఇంకను సందర్భానుసారముగా వత్తురు.



శ్రీ

శుభమస్తు—అవిఘ్నమస్తు

శ్రీ పంచముఖి వీరహనుమాన్ తుభ్యన్నమః

# ప్రహ్లాద

## నాటక భజన కీర్తనలు



ప్రథమాంకము.



ప్రథమరంగము:—సభాస్థానము.

(ప్రవేశము: హిరణ్యకశిపుడు; శంబరుడు; శకుని; మొదలు రాక్షసులు)

హిర—(విచారముతో) అమాత్యశేఖరులారా.

కీర్తన—సావేరి రాగము—చతురశ్రి

పల్లవి—కాలమెంత విపరీతము నమ్మని। కడుపున బెట్టు కొననాశౌరి ॥కా॥

అను—చాలశౌర్యమున్న నేమి జీవ। చ్ఛవమువోలె బ్రదికియుంటి కటకట ॥కా॥

మిత్రి॥ కూలిపోయె కుడిభుజమ్ము నేటికి
గోడుచెడెను సర్వశూన్యమాయెను
మేలుదినములంతరించి మీదను
మిన్నువిరిగిబడినరీతి దోచెను ॥కా॥

2. భూరివిభవ సామ్రాజ్యభోగముల । బూత్రిగనొల్లను కంటికి నిద్దుర । దూరమయ్యె వినుము నామనశపథము । దుర్మార్గుండా హరి నెదిరించియు॥

మిత్రి॥ మారణంబు సేయుకొండ లేకను
మరణమొందుటొండె వానిచేతను
వేరు లేదు రామరాజవరదుని
విజ్ఞవీగనిన్వ బ్రాణముండగ ॥కా॥

కటకటా! సురాసురలక జేయుత్తె, దిగంతవిశ్రాంతకీర్తి నీయుండగు మత్సహోదరుకు నిష్కారణ మల్పునిచే సంహరింపబకునని కలనైనం దలచితిమెటుగ! ఇంతకును “అవశ్యమను భోక్తవ్యం కృతంకర్మశుభాశుభ” మ్మను యార్యవచనంబులు రిత్తయగునే? (తమ్ముని దలంచి) హా! సోదరా! రిపుభయంకరా!

ఉ. ఆలములోన ముజ్జగము ♦ లైన నెదిర్చియు నిన్ను గెల్వగా
జాలరు; స్వర్గముర్గొని ని ♦ శాచరవీరులుగొల్వనిందుౖనిశ
దోలినవాడ వీవసగ ♦ దుష్టవరాహము నొంపనేగియుశ
గూలితివేమనందు రిపు ♦ గోరికలెల్లనుదీరెం దమ్ముడా.

సమయమునకు నేనేల లేకపోతిని. అయ్యో! భుజోద్ధండు లసమాను లింద రనవరతము కైదండ బాసటమై యుండ, నాసన్న మృత్యుబలముగాక, నీవొంటిగా నేలబోదువు? కపట వేషమూని, రిపునొంచుట మాననీయు డనుపించుకొనుచున్న నాహరికి మాత్రిమెట్టిపౌరుషము? నీచాధమా! స్పర్శించునంత

మాత్రమున నొడలాద్యంతము గగుర్పొడుచు నతిహేయమగురా జకార్యమేగాని, నీబ్రదుకునకింక నితరమగుకర్తవ్యమడుగంటినదా? అయ్యయో! పరిశుద్ధాత్ముడవగునట్టి సోదరుడిక నాకెట్లు లభించును?

శంబ—రాక్షసేంద్రా! ఊరడిల్లుమూరడిల్లుము! గతించినదానికి చింతించిన లాభమేమున్నది? కష్టసుఖంబు లొకరి వశమగునా? కాలానుగుణ్యముగ మార్పుజెందుచుండును.

హిర—శంబరా! అవునది నిజమేకాని, కలనైన నా మాటకడుగుదాటక, నతివినయమున బ్రవర్తించు విశ్వాస పాత్రుడగు కుడిభుజమ్ము నిష్కారణముగా కూలిపోవ నే మొండినై జీవించియుండిన సార్థకమేముండును?

శకుని—ప్రభూ! స[illegible]గిన [illegible]నజ్ఞానాంధకార మునబడిన నేమేమని మోదాస్పదము? లోకభయంకర మగు దైత్యకులంబున బుట్టియు, నిట్టివిపరీతవాక్యములాడ జెల్లునా? పగసాధించి వైరిముదముడంప బ్రయత్నింపక నూర కుండుట వంశకళంకముగాదా? గతించిన తమ్ము డెంతవిచా రించినను మరలవచ్చునా?

హిర—మంత్రిపుంగవులారా! హితముగోరి వచించుమీ పలుకులిసుమంత నామనంబున కూరటకల్గించినవి? కానిండిక ముందు కర్తవ్యమేమి?

శంబ—దేవా! కర్తవ్యమునకేమున్నది? దుర్మదుండ గునాహారిని వెదకి సాధించుటయే?

హిర—అట్టి ఘోర సంగ్రామరంగమున కురుకుటకీ సభాస్థానమునగల వీరులయభిప్రాయ మేమి? హరియన్న మూ యలమారిగా నెరుంగుడు.

శకుని—దైత్యాగ్రేసరా! దిగ్విజయుండవగు నీకాహరి యు, గిరియు నొకలెక్కయా! వెనుకంజవేయుటకు మేము మాత్రము పిరికిపందలమనుకొంటివా? నీయాజ్ఞానుసారముగా రణంబునకుఱుక మేమందఱము సిద్ధముగా నున్నారము.

శంబ—దానవేంద్రా! ఆచక్రిగాదీ ముల్లోకములొక్క పెట్టునవచ్చిన వానిపరాక్రమము భగ్నముగావించుటకు మే మందఱము సిద్ధముగానున్నారము.

హిర—దండనాయకా! నీయుద్దేశ్య మేమి?

దండ—దేవా! తనుపాదసాక్షిగా నిత్తరయసైన్యము తో నిప్పుడె హరినుక్కడించు నుత్సాహముతో నుంటిని.

హిర—బలే! రాక్షసవీరులారా! నాపూనిక కెంతయో బలమైన వాగ్దానము లొసంగినారు. మీరిక జాగుసేయక మున్యాశ్రమములను బాడుచేసి, తాపసులనుబట్టి కట్టి, హోమములను జెఱచి, హరియుండు నెల్లతావులను వెదకిరండు. హవిర్భాగములనుదెచ్చి నాకిండు.

తే. గీ. జగములను ధ్వంసమునుచేసి ♦ సాధుహింస
జరుపఁదాన న్లంపడకున్న ♦ చక్రి, గిరి
రణమునందున వానిగ ♦ ర్వంబడంచి
నాశనము జేయ నేహరి ♦ నామమిపుడు.

(ప్రవేశము—నారదుడు)

కీర్తన—మోహనరాగం—చతురశ్రి

పల్లవి—హరిని వేడుడు సుజనులార! అఘవిదూరు లారా! ఘనులారా ॥హ॥

అను—నిరుపమధీరా! నిగమాధారా నిర్గుణగోచరని పుణుండా ॥హ॥

చర॥ దానవమర్దను తత్త్వవిచారణు । తామసభంజను ధర్మగుణుగ । వినయముతో మది ననయముదలచియు। వేడుకమీఱగ బాడుండా ॥హ॥

2. ప్రవిమలరామకవినరదగ । బ్రిస్తుతిసలుపగ నఘమడ గగ । భవనాశుండా తారకనాముని। బరమాత్ముండని దెలియుండా ॥హ॥

హిర—(ఆలకించి) ఆహా! నారదుడుగాబోలు వచ్చు చున్నాడు. (చూచి లేచి) నారదా! రమ్ము కూర్చుండుము? నీవెచ్చటినుండి బయలు దేరి వచ్చితివి?

నార—అసురనాయకా! ఇప్పుడె బ్రిహ్మసభ కరిగి వచ్చుచుండ, మార్గమధ్యమున పాపము నిష్కారణము నీయ నుజాస్మృతి స్ఫురణకురాగ చూచి పోదమని వచ్చితిని.

హిర—నారదా! నీవిశ్వాసమెంతని కొనియాడుదును? నిక్కముగా నీవాహరిభక్తుడవైనను, నాకు బ్రాణసముండవని వచించుచుంటివి? మాయోపాయము జేసి దురాత్ముడా హరి

వరాహరూపమున మదీయసోదరు నంతమొందించి దైత్యకు లంబున కంతకమ్ని వాటిల్లఁజేసినో చూచితివా ?

నార—(తనలో) మాయకుని మాయచేతనే మాప వలయును. అదియునుగాక నాకు కలహప్రియుడన్న సార్థక నామమున్నదియేకదా (ప్రకాశముగా) దానవరాజా! హరి మాయలు నేనెఱుఁగనివా? నీవింక వేరచెప్పవలెనా ?

తే. గీ. హరియు న్నను సామాన్య ♦ డనితలంప
వలదుమాయల మారి యె ♦ వ్వారికైన
కన్నుగప్పును; దైత్యుల ♦ గర్వమడతు
ననుచు మీతోడవైరంబు ♦ గనుచునుండు.

మీరుమాత్రమునుక్షణమేమరి యుండరాదు.

హిర—నారదా! అది నేనెఱుంగుదు. అందువల్లనే వానివధోపాయ బ్రయత్నము లాచరింపుమన్నవాడను.

నార—హరివధోపాయ మాలోచించితివి?

హిర—నారదా! ఆలోచన కేమున్నది.

కీర్తన—ధన్యాసిరాగం—చతురశ్రి.

పల్లవి—నామదిగల్గిన యూహనుదెల్పెద । నారద సాంతముగా వినుమా ॥నా॥

అను—క్షేమమెంచి యాలోచనజెప్పుము । జీవితముండగ మఱువనుసుమ్మా ॥నా॥

మిత్రి॥ తామసగుణములని గలదివైచెద
ధారుణినెల్లను; మునిజనజపతప

హోమకుండముల జెరచి సాధువుల
నామమాత్రముగ జేసి చూచెదను ॥నా॥

2. సురగరుడోరగ యక్షకిన్నరుల । జూపుమందునా శ్రీహరిజాడను । కరవాలంబును జూపిలోకముల కల్లోలంబొనరించెదబూత్రిగ॥

మిత్రి॥ నదులగిరుల మృగపక్షికులంబుల
నాశనంబు జేతు సాగరంబుల
వరుసనింక జేతు గానుపించడే
వైకుంఠుండింకెక్కడదాగునో ॥నా॥

సర్వము నాశనమొనర్తును? పాపాత్ముండగు హరిని వెదకి సాధింతును.

నార—దైత్యేంద్రా! నిజముగా నీవంతటి బలపరాక్రమవంతుడవే! సందియము లేదు. కానినామాటవినిచుక విశ్వసింపుము

చ. భుజబలవిక్రమంబున ♦ తపోధనులెందఱైనఁ జంపు వా
రిజపత్రపంబులన్నియుహ♦రింపుములోకములన్ని గాల్చియున్
ప్రజలనుహింసబెట్టియును♦పాయములెన్నియొనన్నమైనవా
రిజనయనుండు గన్పడఁడు ♦ రేబవలెంతిప్రయాసనొందినన్

హరియన్న నీవేమో యనుకొనుచున్నావు? మాయలకు మాయాతీతుడు. నీకంటె ఘన్నుగడలం దసమానుడని యెఱుంగుము.

హిర—నారదా! అయిననా కేయుపాయమున నాపాపాత్ముడు గోచరించును?

నార—దైత్యేంద్రా! నాకుదోచిన చక్కనిమార్గము నొకటి యుపదేశించెద. నీవు త్రికరణశుద్ధిగా నట్లొనర్చెదవా?

హిర—నారదా! నీవంటి ఋషిసత్తము లుపదేశించు నియతినాచరింపనంతటి మూర్ఖుడనైనానుందునా? ముమ్మాటికి నాచరింతును. దయయుంచి సెలవిమ్ము.

నార—దానవనాథా! కోరనిదె తడవుగ నెల్లకామ్యార్థములొసంగు పరమేష్ఠినారాధించి, సర్వదిగ్విజయంబులగు వరంబుల బడసినగాని నీకాహరి లభ్యంబుగాడు. ఒకవేళ నీవా హరిని కనుగొనినను, రణంబున నిగ్రహింపజాలవు. నీవంటి మహాశూరులతని చక్రానల జ్వాలల నంతమొందినవారెందరో కలరు. తెలిసి నిష్కారణమేల హరిచేత మడసెదవు? నాహితమువిని నీవవశ్యమట్లొనరింపుము

హిర—మహాప్రసాదము? నారదా! నీహితోపదేశ మెంతయు శ్లాఘనీయము. తపోమహిమచేత విధాతను బ్రసన్నుని జేసుకొనుట కిప్పుడే మందరాద్రి కరిగెద.

నార—మంచిది. నీకుశుభమగుగాక! నాకిక సెలవు. (స్వగతమున) కలహబీజమునకిదియే ప్రారంభము నాప్రయత్నమెంతవరకు కొనసాగునో చూచెదగాక.

(నిష్క్రమించును)

హిర—మంత్రిసత్తములారా! నారదహితోపదేశకతంబున విధాతనారాధింప మందరాద్రికరిగెద. మీరికసప్రమత్తులరై యుండక, రాజ్యభారము వహింపుడు.

శంబ—స్వామీ! మహాప్రసాదము? మీకుశుభమగు
గాక!

హిర—అమాత్యులారా! నేటికి కొలువుచాలింతము

శంబరీశకు—చిత్తము.

(నిష్క్రమింతురు)

ద్వితీయరంగము—అంతఃపురము.

(ప్రవేశము: లీలావతి, విద్రుమోష్ఠి.)

లీలా—(విచారముతో)

కీర్తన—హిం—తోడిరాగము ఆశ్రి.

పల్లవి—ఏమిసేతునే! ప్రాణేశుడింకరాడాయె ॥నే॥
అను—క్షేమసమాచారమైన । చెలియ తెలియ
రాకున్నది ॥ఏ॥

చ॥ తామసమేలనువారిపై । తనకుందపమదేలనమ్మ ।
కోమలినారమాడ్క్రియ । కులనాశనమొనరింపగ ।
ప్రేమనటించి-మాటలుపెక్కువచించి- దనుజస్వామిని
మన్నాథునిటుల - సర్వపరిత్యాగుజేసి ॥నే॥

2. నేలవిడిచిసాముజేయ । నేర్పరితనమౌనె; భక్త ।
లోలుడు బరమాత్ముగెలువ । లోకములన్నియుజాలునె
కాలమిటులమారె । మముగాచువారులేరె - పరిపాల
నమ్ముజేయుకున్న - ప్రభువురాముకవివరదుడు ॥ఏ॥

కటకటా! హితముగోరి నేనాహరిపై బగవలదని యెంతజెప్పినను వినక, మన్నాథుడు పట్టుదలబూని తపమునకేగి యింతవరకు రాడయ్యె నేమిసేతును?

సీ. వినడాయెనే! మేలు ♦ గనడాయెనే! కూళ
తనమేలనే! ఘోర ♦ తపమదేల
తగదంచుమనకిట్టి ♦ పగలంచు మ్రొక్కి-బో
వగ నష్టు పడిగోర ♦ వ్యర్థమాయె
కలలోననైన న ♦ వ్వులకైన హరితోడ
చలమూనుపతియుంచు ♦ దలుపనైతి
మతిలేదు కాలవిూ ♦ గతిమారెనాప్రాణ
పతివీడి నిమసంబు ♦ బ్రదుకలేను

గీ. కుడిభుజమ్మాకుతమ్మని ♦ గోలుపోయి
జగము గ్రుంగియు వగచు రా ♦ క్షసవిభుండు
నారదుపదేశమునలోక ♦ నాథుతోడ
వినక బగబూనదగునన్న ♦ విద్రుమోష్ఠి.

జగదీశ్వరు నిర్జించుటకు బరమేష్ఠి వరప్రభావమా కారణము? ఇట్టి పిచ్చి తలంపు నాథునికేలగల్గెను? అమ్మా! విద్రుమోష్ఠి! నాకంతకంతకు గర్భభార మధికమగుచున్నదే? ప్రసవదినములుకూడ సమీపించుచున్నవి. ముందేమి జరుగనున్నదో తెలియరాకున్నది.

విద్రు—అమ్మా! సమయోచితముగనిచ్చకపుమాటలాడి మానులు ప్రభువులను తమమాయవలలోం బడవేసు

తన్యమున రాబోవు యుపద్రవము కొంతజక్కబకునని గదా యూహించి వచ్చితిని. నాకార్యమేల మఱువవలయును. [ముందునకు బరిక్రమించి] ఆహా! ఇదియే లీలావతాంతఃపుర ము రాజు లేకుండ మహాపతివ్రతాతిలకమగు జెల్లునీమె శుద్ధాంతఃపురమునకు నేనెంత యవివేకుడనై చొరబడుచుంటిని? చొరబడకున్న నెట్లు? నావంటి పురుషశ్రేష్ఠున కిది సాహసకార్యమగునా? ఇట్టి విపరీతాంశమున తప్పకిట్టిదియే సాహసమన బడును. ఆలోచించిన కార్యభంగమగును. లోనికేగెదగాక.

(అని లోనికేగును.)

విద్యు—(చప్పుడువిని) అమ్మా! ఎవరోవచ్చుచున్నట్లున్నారు అడుగులచప్పుడు వినబడుచున్నది.

లీలా—చెలీ! శీఘ్రముగాబోయి చూచిరమ్మా.

విద్యు—(పోయిచూచి మరలభయముతో ప్రవేశించి) అమ్మయ్యో! ఎంతమోస! మెంతమోసము! నాకునం బాం దోళమునొందుచున్నదమ్మా? నోటమాటరాకున్నది తల్లీ!

(అని తల్లడిల్లును.)

లీలా—(గద్గదస్వరముతో) ఏమే! అట్లు కంపించి పోవుచుంటివేమే? ఆవలజరుగు భయానకవిషయమేమే?

విద్యు—[గజగజవణకుచు] అమ్మా! సుందరసుకుమారు డెవడో పరపురుషుడొక్కరుడు మన శుద్ధాంతఃపురమున బ్రవేశించెను.

లీలా—(ఆశ్చర్యభయములతో) ఏమీ! పరపురుషాకృతియేనా? అంతఃపురమున బ్రవేశించెనా? నిజముగా నీ నేత్రములతో వాని దిలకించితివా? లేక కలగంటివా?

విద్యు—అమ్మా! నేనేల మీతోడ మాతనములాడుదును. నామాటలు నిక్కవములు! నిజముగానే కండ్లారవానిం దిలకించితి.

[తొందరగా ఇర్వురును ముందునకు వత్తురు ]

[ప్రవేశము—దేవేంద్రుడు.]

దేవే—[లీలావతినిజూచి స్వగతముగ] నవయౌవన లావణ్యరూపురేఖావిలాసయగు నపరలక్ష్మియో యన నిజ నచ్చెలితో నాకన్నెదుట సాక్షాత్కరించిన దీమెయేగాబోలు దైత్యరాజగృహిణి. ఇప్పుడు నాకర్తవ్యమేమి?

లీలా—[నివ్వెరపడి ధైర్యముతో] అయ్యా! నీవెవ్వరవు? పోతుటీగకైన దూర నశక్యమగు మదీయ శుద్ధాంతఃపురమున కెట్లు బ్రవేశించితివి? పరపురుషులెట్లు మానధనులగు స్త్రీజనావాసమున కాజ్ఞలేకయే రావచ్చునా?

దేవే—అబలా! నీవన్నది నిక్కవమే? స్వర్గలోకాధిపతియగు దేవేంద్రుడు ఈపాటి నిను మెఱుంగనివాడుకాడు. అయినను కార్యాంతరమున బ్రవేశింపవలసివచ్చినందులకు మన్నింపుము.

లీలా—మూఢుడా! సిగ్గుమాలిపోయినదా? స్వర్గలోకాధిపతివి, దేవేంద్రుడవని, విఱ్ఱవీగి యుక్తాయుక్త మెఱుంగ

లోకాదినాథుడవట్టి నీకు నిర్నిమిత్తముగ మదీయగర్భచ్ఛేదన
బుద్ధి వొడమనేల? దానవీకుగల్గినమహానర్థకమేమి?

దేవే—తరుణీ! నీవడుగుప్రశ్నకేమని సమాధానమి
య్యగలను?

చ॥ పరమపతివ్రతామణివి ♦ బాహుబలుండగుదైత్యరాజమం
దిరమునఁ బట్టరాణివి వ ♦ ధూపగమానసమున్ జాలిము
ప్పిరిగొను; నీదుగర్భమున ♦ పిండమునాకువిరోధిగాన, ని
ర్జర హితమెంచి కాంతసిను ♦ జంపెదనిప్పుడి కేమిసేయుదున్.

స్వజనాభిమానము నన్నింతదనుక పురికొల్పుచున్న
యది. గన్క నేనిప్పునికిధర్మవిరుద్ధమైనను బూనుకొనియున్నాను

లీలా—అయ్యో! సురనాథా! ఇదేమిన్యాయము?

చ॥ కలవు సమస్తజీవులకు ♦ కష్టసుఖంబులు, వారికర్మయే
తెలియఁగ కారణంబొగుల ♦ దైవస్వభావమునిట్టిధర్మమే
బలుపవు, ధర్మమార్గపర ♦ పాలన చేయుమువట్టి నీవు కాం
తలనెటుల జంపఁజూచెదవు ♦ తావిమికెంగసుహత్యచేకురున్

గర్భస్థపిండమెప్పటికో ముప్పుదెచ్చునని నీవంటి వాడి
ప్పునికిప్పుడుమాత్రము తొందరపడరాదు. భవితవ్యమెవ్వ
రెఱుంగజాలరు? నీవు నాపాలిదైవము! దీనురాల! నబలను!
శుద్ధాంతఃపురవాసను. గర్భిణిని. నాయందు కటాక్షముంచి
మారుమాటాడక జనుము.

దేవే—సాధ్వీ! నీవు నాకు న్యాయమార్గముపదేశింప
నక్కఱలేదు. నేనువచ్చినపని పూర్తియగునంతవరకు వెడలు

వాడనుగాను. స్త్రీవధాపాతకమైనను, శిశుహత్యాదోషమునకైనను వెనుదీయను. అన్నిటికంటె నమరసంరక్షణోపాయ మొకటి నామనంబున వేరునాటియున్నది.

లీలా—మూర్ఖా! నీకాకుదోడబుట్టినవులున్న నిట్టిగర్భనిర్భేదకముగా మాట్లాడియుండవు. నాపతియే నాచెంతనున్న నీగర్వాపహృతునైన వాడజేయగలసామర్థ్యమునీకుండునా! నిర్భాగ్యుడా! నావంటి సతీతిలకమునకెగ్గొనరించి, నీవమర సంరక్షణము జేయుదువా? తీవ్రమగు నాశాపమువలన నీసామ్రాజ్యమంతరింపదా! నీకులము మన్నుగలియదా? నీయశము మసిగంటదా? నావేడికన్నీరు నీకును, నీలోకమంతకును నాశనహేతువని పూర్తిగ నెఱుంగుము.

దేవే—కాంతా! నీవాడుబల్కులకింతవరకు సహించితిని. నీవెంతపౌరుషముజూపినను నాపూనికి నిసుమంతయు మానృజాలను. తారతమ్యమెఱుంగక నోటికివచ్చినట్లు నీవెంత ప్రేలినను లాభములేదని యెఱుంగుము. నీవే మోసపింతువని భయపడి నాపూనిక నిసుమంతయు మానుకొను వాడనుగాను నీశాపమొక్కటి భరించిన భరింతునుగాక నాకొనర్చిన సాహసమున కెన్నికోట్ల జీవరాసులు సుఖమొందెద రనుకొందువు. కావున త్వరపడుము. నీయిష్టదైవమును ప్రార్థించుకొనుము.

లీలా—(భయముతో వడకుచు) హా! దుర్భరము! దుర్భరము! సురనాయకా! మానవంతుడవగు నీవంటి వాడిట్టి దారుణకృత్యమునకు బాల్పడిన నేనేమి చేయగలను?

డైలాగ్.

కీర్తన—హిం—ముఖారిరాగం—త్రిశ్ర.

పల్లవి—ఇంతద్రోహమా! నీ ॥కిం॥

అను—కాంతుడు లేకుండజూచి । కంతముదెగనఱుకుదువా ॥ఇం॥

చర॥ సుంతయైనదయలేదా । చూడుమన్యాయమువలదా। కాంతనబలనార్తురాల। స్వాంతమునందెంచుమయ్యా ॥ఇం

దేవి—పల్లవి—నోరుమూయుమా! నీ ॥నో॥

అను—వేరుమాట లేలచావు। విధియని తలపోయుమతివ ॥నో॥

చర॥ కోరికతో నీగర్భము । జేరివంశముండకుండ । మారణాకేసెదనమ్ముమా । మగువ జూడు కరవాలము ॥నో॥

లీలా— పాపీ! నీకరవాలము । పాముగాను దుర్మదాంధ । శ్రీపతిరారాసముదము । చేరకనిసి దీనురాల । కాపాడుము నన్నురామ । కవినరవా! ప్రణమిల్లుదు ॥ఇం॥

హా! ప్రాణేశ్వరా! (అని మూర్ఛిల్లును)

విక్ర—(ఆత్రముతో) అయ్యయ్యో! యీ యువ మూర్ఛిల్లినది దురాత్ముడీమె నేమిచేయ దలచియున్నాడో గదా? నాకన్నులతో నిందుండి చూడజాలను.

(నిష్క్రమించుచున్నది)

దేవి—అక్కటా! ఇప్పుడు నాకేమియు దోచకున్నయది. శిశుహత్యాదోష మెట్లయినను తప్పకయుండ, నీ స్త్రీ

వధా పాతకమునకుగూడ బాల్పడనా? అయినను నావంటి వాడీ దారుణమాచరింప నెవ్వరైన విన్న నవ్వరా? నాకిప్పుడీమె పూర్తిగా చేతికి జిక్కినది.

తే. గీ. చంపకేయాడకున్నదీ ♦ సాధ్వినమర
లోకమున జేర్చి చెఱవెట్టి ♦ ప్రాకటముగ
బ్రసవదినమున సిసువును ♦ బట్టిగోయ
దీరుమాగోర్కెలింక వి ♦ చారమేల॥

కావున సత్వరమీమెను నాకమునకుగొనిపోయెదగాక.

(తెరపడును)

తృతీయరంగము—అరణ్యము

(ప్రవేశము: దేవేంద్రుడు; లీలావతి)

లీలా—(కన్నీళ్లుగార్చుచూ) అయ్యో! సురనాథా! నన్నెందులకేడ్పించెదవు? మూర్ఛిల్లియున్న నన్నేల నీభీకరారణ్యప్రాంతమునకు దోడ్కొనివచ్చితివి?

కీర్తన—భాగేశ్వరిరాగం—చతురశ్రి

పల్లవి—తగునా! సురనాథా! నిం । దాస్పదమ్ము! నీకింతదారుణము ॥త॥

అను—పగబూనియునార్తురాలనిటు చెఱ । బట్టదగునె? దిట్టతనమె? కటకట

చర—మనవివినుము దయనుగనుము నివిక । మఱలిపొమ్మ, మఱచిపొమ్ము వైరముఘనతగాదు హింసబెట్టబోకుము । కాంతనయ్య! గర్భవతిని, విడువుము ॥త॥

(2) కరుణింపుము ప్రభిమాలెద దుష్కర । కార్యమేల
నొనరించెదవన్య । శరణంటిన్న జాలిబూనదగవా । సర్వనా
శనంబగుననినమ్ముము ॥త॥

అక్కటా! సోదరభావమున నిన్నింతవేడిన నిసుమంత యైన జాలిబూనకున్నావు! రాతినైన కరగించునాయేడ్పు పాషాణహృదయుడవగు నీకేమియు వినబడుటలేదు. (భర్తనుద్దేశించి) హా! ప్రాణేశ్వరా! నన్నీకూరుని బారినుండి తప్పింపవా? నాయాపదనివారింపవా?

దేవే—కాంతా! తపమునకేగిన నీనాధుడేరీతి నిన్ను గాపాడును. నీవెంతయేడ్చినను, నాకమునకుగొనిపోయి చెఱ వెట్టకమానను. సానునముగా నావెంటరాక వెక్కుమాటలాడితివేని నీతల వ్రక్కలించుటకిదిగో నాచేతియందు వజ్రాయుధమున్నది జాగ్రత్త.

లీలా—ఓరీ! నీవజ్రాయుధమువల్ల కాకుగాను. నీస్వర్గసామ్రాజ్యాధికార్యమంతరించిపోను. నీవంశము నిర్వంశముగాను. మూర్ఖాగ్రేసరుడనున్న నన్నింతవరకు చెచ్చితివిగాని లేకున్న నాకంఠమున ప్రాణములున్నంతవరకు నీకోడబడి నీవెను వెంటనత్తునని తలపోయకుము. స్వప్నమునైనదలపోయకుము.

దేవే—ఏమేమీ! మంచిమాటచే నింతవరకు జెప్పితిని గాని యీపాటి మహాకార్య మొనరించుటెంతకావలయు. లెమ్ము. కాలయాపనమగుచున్నది.

(బలాత్కరింపబోవును)

లీలా— (రోదనముసేయుచు) అయ్యో! అయ్యో! నీచాత్మా! నన్నంటకు ముట్టకుము' ఆర్తనై విలపించు నాయాపదనివారింపనీయరణ్యమున నొక్కరైన లేకుండిరా! ఓవన దేవతలారా! వన్యమృగసంఘములారా! మునిపుంగవులారా! తరులతాదులారా! నన్నీక్రూరుడు మన్నాధుడు లేకుండజూచి చెఱవెట్టకుతూహలముతో గొనివచ్చుచున్నాడు. మీరెవ్వరైన నామొఱనాలించి రక్షింపరా! రక్షింపరా!

(ప్రవేశము; నారదుడు)

నార—(దూరమునజూచి) ఏమిది? నిర్జరారణ్యప్రదేశమున నబలార్తారవము విన్పించుచున్నది? (నిదానించిచూచి)వాడెవడో నక్తంచరుడొక నారీరత్నమును బలాత్కరింపుచున్నవాడు! (పరిశీలించి) కాదు! కాదు! దేవేంద్రునివలె నున్నాడేమి చెప్పుమా! సందియమేమి? నిక్కముగ నితడు పేంద్రుడే! ముంగురులు చెదరనేడ్చుచున్నవా రెవరు చెప్పుమా? దగ్గఱకేగి విమర్శించెదగాక—(దగ్గఱకేగును)

దేవే—(చూచి) మునీంద్రా! నమస్కారము (నమస్కరించును)

నార—విజయీభవ! సునాశీరా! ఇదేమిదారుణమీమె యెవరు?

లీలా—(మునిపాదములబడి) మునీంద్రా! రక్షింపుము! రక్షింపుము.

నార—దీర్ఘసుమంగళీభవ! అమ్మా! భయమువలదు లెమ్ము! (అని లేవనెత్తును)

దేవే—ఋషిచంద్రమా! పతివ్రతాలలామయగు బర గుణీమె హిరణ్యకశిపునిల్లాలు! నేనీమెను నాకమునకు గొని పోవుచుంటిని.

నార—(ఆశ్చర్యముతో) ఏమేమీ! హిరణ్యకశిపు నిల్లాలా! నీవీమెను నాకమునకు గొనిపోవుచుంటివా?

తే. గీ. లోకకంటక భుజబలో ♦ ద్రేకుడైన
దైత్యరాజేంద్రురాణి ♦ సద్ధర్మచరిత
నీమెఁ గొనిపోవ కారణ ♦ మేమిచోర
వృత్తి దగునొకో నీవంటి ♦ యుత్తమునకు.

నిష్కారణముగా నీమెను నాకమునకు గొనిపోవుటేల?

దేవే—నారదా! కారణముండియేకదా గొనిపోవు చుంటిని. విను మీతరుణీమణి గర్భస్థపిండము దేవగణ శత్రుస్థానముగాన వానినుక్కడింపవలయునను నూహతో ప్రసవించు వరకు నీమెనునాకమునందు చెఱబెట్టుటకు గొనిపోవుచుంటిని.

నార—దేవేంద్రా! నీవెంత పొరబడితివి. ఈమె గర్భస్థపిండము దేవగణశత్రుస్థానము మటకుమారు మిత్రుడనుము. అతడు కేవలమానారాయణ పాదభక్తుడగునని నమ్ముము. నేనీరహస్యము బ్రహ్మవలన నొకనాడెఱింగితిని, కావున నిక నీవేమియు దుర్మార్గమాలోచింపకుము.

దేవే—మునీంద్రా! తెలియక పొరపాటొనరించితిని. క్షమింపుము (లీలావతినిజూచి) అమ్మా! లీలావతీదేవీ! యుక్తాయుక్తమెఱుంగక నిండుగర్భవతిని నిన్నెంతయో శ్రమబెట్టితిని. నాయందు కటాక్షముంచి మన్నింపుము. తల్లీ! నిన్ను మరల నీయంతిపురికి గొనిపోయెదరమ్మా.

నార—మహేంద్రా! వలదు. వలదు. ఆమెపతివచ్చుదనుక మదీయాశ్రమముననే యుండును. నీవికజనుము.

దేవే—చిత్తము. (నిష్క్రమించును.)

లీలా—దేవా! తమయనుగ్రహమున బ్రదికితిని.

నార—తల్లీ! దైవానుగ్రహమనుము. రమ్మా. నాయాశ్రమంబున కొన్నిదినములుండిన పిదప నిన్ను నీనాథునకు సురక్షితముగా నప్పగింతును.

లీలా—మహాత్మా! తండ్రివలె నన్నాదరించు మీయదియే భారము. తపమునకేగిన మన్నాథుడువచ్చు దనుక దమయాశ్రమంబుననే మీవల్ల ధర్మాధర్మము లెఱుంగుచు కాలక్షేపము జేయుదును.

నార—తల్లీ! నీకు శుభమగుగాక! రమ్మపోదము. (స్వగతమున) ఆహా! ఇదియే మంచితరుణము. ఎట్టులో నేనీమెకు నారాయణమంత్రముపదేశించెద నందువలన నీమెగర్భస్థశిశువుకూడా భగవద్భక్తుడగును. లోకమునకు మహోపకారమొనర్చిన వాడనగుకను.

(నిష్క్రమింతురు)



శ్రీ

శుభమస్తు—అవిఘ్నమస్తు

శ్రీ పంచముఖి వీరహనుమాన్ తుభ్యన్నమః

# ప్రహ్లాద

## నాటకభజనకీర్తనలు

ద్వితీయాంకము.

ప్రథమరంగము—మందరాద్రి.

[ప్రవేశము:-తపసివేషముతో హిరణ్యకశిపుడు.]

హిర—[కరములుమోడ్చి ధ్యానమభినయించి]

కీర్తన—మోహనరాగము—చతురశ్రి.

పల్లవి—జయజయహిరణ్యగర్భవిధాతా । జయజయతు సృష్టినేతా ॥జ।

అను—దయనురారా ! నయముమీరా ! దైత్యదాసుని మొఱవినరా ॥జ॥

చర॥ అనవరతము నిన్నుమనమునదలచెద । కనులకు గన్పడవేరా । ఘనతగాదా! గానరాదా! కమలగర్భ । నీకిది మర్యాద ॥జ॥

2. కమలజాండభక్త - కరుణాసాగర మ్రొక్కి - కరములు మోడ్చెదనయ్యా । సమయమయ్యా ! సాకుమయ్యా! సర్వసాక్షివినీవేగదయ్యా ॥జ॥

దేవా! కమలాసనా! నిరంతరమాహారపానీయములెల్ల కనిన్నుగూర్చి తపంబొనరించుచున్న నాయెడ నొక్కింత కరుణ జూపకున్నవిదేమిధర్మము? తండ్రీ! నిన్ను గొనియాడ నేనేపాటివాడను?

సీ. కమలగర్భవిరించి ♦ కరుణామయవిధాత
పరమేష్ఠివనుబ్రోవు ♦ శరణుశరణు
సర్వభూతములందు ♦ సమదృష్టినొప్పారు
జగధీశ! నానమ ♦ స్కారమిదిగొ
భువనసృష్టికిస్వయం ♦ భువుడవైజన్మించి
సృష్టికర్తవనంగ ♦ స్తుతులివిగొ
త్రిగుణాత్మకుడవీవు ♦ నిగమవేద్యుడవయ్య
గురువిలాసుండ జో ♦ హారులివిగొ

గీ. రారచతురాన నాపదో ♦ ద్ధారకుండ
వయ్య! వాణీశ! నినుగొల్తు ♦ నయ్య మ్రొక్క
దేవమాంపాహి! మాంపాహి! దివ్యరూప
యనుచు నేప్రార్థిం(బ్రార్థింతు) ♦ నజుడనిన్ను.

[బ్రహ్మసాక్షాత్కరించును.]

బ్రహ్మ—ఓయీ! దానవేంద్రా! నీభక్తికి గడుమెచ్చి
తి. నీకువలయువరంబడుగు మొసంగెద.

హిర—దేవా! కరుణామయుడవగు నీవు నన్ను రక్షింప వరంబు లొసంగవచ్చుట నాయభీష్టము నెరవేర కుండునా? తండ్రీ! నాకోర్కెను విన్నవింతును వినుండు!

సకల శ్రీహోదాయకమగు నింద్రత్వమును, యశస్సాంద్రంబ
గునచేయత్వంబును బ్రసాదింప గోరుచున్నాడను.

బ్రహ్మ—కుమారా! దుర్ఘటమగు నమరత్వముసం
గుట కెవ్వరికిని దరముగాదు! నీవద్దానినిగాక మరొండు వర
మెద్దియైన గోరుమిచ్చెద.

హర—దేవా! నిష్కల్మషహృదయమున దమ
రీపేదకట్టి వరమైన బ్రసాదింపకున్న నేమరల మరల గోరిన
ఫలమేముండును.

బ్రహ్మ—ఓయీ! యట్లనవలదు. నిశ్చయముగా నీవు
కోరిన నింద్రత్వమొక్కటిదక్క మరొండువరమేదైన నిచ్చెద
ముమ్మాటికి గోరుకొనుము.

హర—దేవా! అట్లయిన నామనో నిశ్చయమును
వెల్లడిచేయుచున్నాను వినుడు.

సీ. వినుమయ్యనాకోర్కె ♦ యనుమానమునువీడి
వివరంబుగానేను ♦ విన్నవింతు
సకలభూతములచే ♦ నస్త్ర్యలచేనింటి
లోపల బయటను ♦ లోకమందు
పగలురాత్రులయందు ♦ పన్నగనగసురా
సురయక్షగరుడకి ♦ న్నరుల నరుల
సచరాచరంబుల ♦ సర్వకీటకమృగ
పక్షిజాతాదుల ♦ భయముగలుగ

తే. గీ. కుండనసమాన భుజబలో ♦ ద్దండశక్తి
సర్వలోకాధిపత్య తే ♦ జంబొసంగి
వరముదయజేయుమని నీదు ♦ చరణయుగము
గోరి ప్రార్థింతు నే మన ♦ సారతండ్రి.

బ్రహ్మ—మంచిది. దానవేశ్వరా! నీయభీష్టము నెరవేరుగాక!

(అంతర్ధానమగును.)

హిర—ధన్యోస్మి! ధన్యోస్మి! నాకన్న ధన్యాత్ము డింకెవ్వరు? ఆహా! నేటికిగదా! పరమేష్ఠి నారాధించి ప్రసన్నునిజేసికొని వరములం బడసితిని. ఇక నేనెంతయు కృతార్థు డనైతిని నాకార్యమెల్ల ఫలించినది.

కీర్తన—వసంత రాగము—చతురశ్ర.

పల్లవి—నాకోర్కె ఫలియించె బూర్తిగను-నాకీర్తి వ్యాపించునింక ముల్లోకాతీతుడనైతిగా ॥నా॥

అను—ప్రకటముగ జగమెల్లను జుట్టియు। ప్రళయము జేయను నాకెవరడ్డిక ॥నా॥

చర॥ నాకాధీశునిబట్టి దేవతా। నీకముపై దండెత్తి స్వర్గ
ముచు। జేకొని హాయిగనేలెద దైత్యులు। జేజేయని
ప్రార్థింపుచుండగను ॥నా॥

2. సురగరుడోరగ గణములలెక్కా। చూడగ లోకము
లన్నియులెక్కా। సరకుజేతునే! నేలరాయనే। సర్వ
ము నావశమైనదింక హో ॥నా॥

3. బలమున సాగరమింకించితుగా । పాపిని శ్రీహరి వెదకిం
తుగా । ఖలుశిరమిప్పుడె ఖండించియు మద । గర్వ
మడంచెద! వంచెద! మించెద! ॥నా॥

ఇప్పుడె మత్పురికేగి, సపరివారముతో త్రిదివముపై దం
డెత్తి, సర్వనాశనమొనరించి, పాపాత్ముండా హరిని వెదకి
సాధించెదగాక !

(నిష్క్రమించును.)

ద్వితీయరంగము—విష్ణులోకము.

(ప్రవేశము:—శేషశయ్యమీద బరుండి విష్ణు, దేవేంద్రుడు)

దేవే—(కరములు జోడించి)

కీర్తన—కన్నడదర్బారురాగం—చతురశ్ర.

పల్లవి—జయనారాయణగోవిందా । జయమాంపాహి
సదానందా ॥జ॥

అను—జయమన్మృగపాదాబ్జరవిందా । జయనామామృత
మకరందా ॥జ॥

చర॥ సనకసనందన సన్మునిబూజిత । సచరాచరసమపరి
పాలా । వనరుహనయనా! జననుతవదనా । ధనమద
బలరిపుదానవమర్దన ॥జ॥

2. నిగమాగమగుణ నిర్జితసద్యశ । జగదాధారా! పర
మాత్మా । భగవన్నామా! వ్రితనిష్కామా । క్షీణ
మోదయఘనపారిజాతమా ॥జ॥

దేవాదిదేవా! దీనశరణ్యా ! మాంపాహి! మాంపాహి !

విష్ణు—దేవేంద్రా! మీకెల్లరకు క్షేమమేకదా ?

దేవే—సకలాంతర్యామివగు నీవెఱుంగని దీభువనత్రయమం దెచ్చటనైననుండునా? మహాత్మా! నేనేమని మనవి చేయగలను! నాదీనావస్థ నానోటనే వినుమువుగాక !

ఉ. ధాతవరప్రభావమున ♦ దానవవీరుడొకండు మున్న ప్ర
ఖ్యాతిదలిర్పస్వర్గమును ♦ గైకొని పుత్రకళత్రబాంధవో
పేతముగా వనాటవికి ♦ పెందలె బొమ్మని నన్నదోలె దు
ర్జాలినిద్రుంపకున్న నిము ♦ సంబర చేతిని బ్రాణమయ్యెడిన్

శరణాగతత్రాణ బిరుదాంకితుడవగు నీవిట్లూరకున్న ప్రపంచమున నఖిలజీవరాసులిక మనుటయే కష్టము.

విష్ణు—ఏమేమీ! నీచాధముడగు దైత్యుడొక్కడు మీమధ్య స్వర్గమాక్రమించి మిమ్ముల వెడలనడిపించెనా? అయ్యో! సకుటుంబముగ నడవులబడి తిరుగవలసివచ్చెనా? ఆహా! నేడిట్టి కర్ణకఠోరమగు వార్త నావీనులబడినది. దేవేంద్రా! వాడెవడు ?

దేవే—దేవా! ఆకథ సవిస్తరముగ విన్నవించెద నాకర్ణింపుడు. మున్ను లోకభయంకరుడగు హిరణ్యాక్షుని వధానంతరమాతని యగ్రజు డిట్టుల పెచ్చుపెరిగినాడు.

విష్ణు—ఏమి! హిరణ్యాక్షుని కగ్రజుడా! వీడు? వీని పేరేమి ?

దేవే—త్రిలోకకంటకుడన బరగు నీతని పేరు హిరణ్యకశిపుడు.

విష్ణు—అక్కా! భయంకరనాముడే! (దైత్యునుద్దేశించి) ఓరోరి! సాధుహింసాపరాయణా! దైత్యాధమా! నీకు కాలమాసన్నమైనది కొందలపడకుము. (దేవేంద్రుని జూచి) పాకశాసనా! తరువాత?

దేవే—తరువాత నో దేవా! దుర్మదుడగు నాదైత్యుడు విధివశాత్తున మందరాద్రి కరిగెననువార్తవిని వాని భార్య గర్భస్థశిశువునైన నంతమొందింప బలాత్కారముగా నామెను చెఱపెట్టుటకు నాకమునకు గొనివచ్చుచు మార్గమధ్యమున నారదమహర్షి యుపదేశమున నామెనట విడిచి నేనమరలోకమునకు బోతిని నారదుడామెను నిజాశ్రమమునకు గొనిపోయినాడు.

విష్ణు—అయ్యో! పూజ్యురాలగు నామె నేల హింసింపబూనుకొంటివి, తరువాత! తరువాత!

దేవే—అంతపిమ్మట నో మహాత్మా! విధివరప్రభావమున నాముని కీ రక్కసు డుక్కుమిగిలి చెలరేగి వచ్చుచు నారదాశ్రమమున నున్న భార్యవలన వృత్తాంతమంతయు నెఱిగి, నామెను సురక్షితముగా నంతిపురికి జేర్చి, సపరివారముతో బయలుదేరివచ్చి నాకము ముట్టడించి, మమ్ములను దరిమి, దిక్పాలుర నెల్లరను హింసించుచుండెను.

విష్ణు—స్వర్గభూముల నాక్రమించుకొనుటయేగాక దిక్పాలుర నెల్లరను హింసించుచుండెనా?

దేవే—దేవాదిదేవా! దిక్పాలురయవస్థ లేమని విన్నవింతును?

సీ. అధికారబలముచే ♦ నష్టదిక్కులకేలు
ఏయులోకనియాజ్ఞ ♦ గోరవలసె
నఖిలభోగములచే ♦ నలరారు సుకుమారు
లసురసేవావృత్తి ♦ మసలవలసె
ధర్మసాధములనో ♦ ప్పారనుండుమహాత్ము
లెలమి కారాగార ♦ మలముకొనిరి
కటకటా! శుద్ధాంత ♦ కాంతాసమూహంబు
గుజ్జుపుశాలలో ♦ గుందవలసె
తే. గీ. భీతిపవనాగ్నివరుణకు ♦ బేరులాది
దిక్పతులుదైత్యపీటిని ♦ దిక్కులేక
భ్రాంతిజీవచ్ఛవంబుల ♦ పగిదినుండి
రహ్యా! నారాయణా! విను ♦ మయ్యాదండ్రి.

విష్ణు—కటకటా! ఎంతకష్ట మెంతకష్టము!

(పరివేషము; జాబాలి; గాలవుడు)

జాబాలి—గాలవా! లీలామానుషవిగ్రహుండగు నా భగవద్దర్శన మెంతనయనానందకరమో వర్ణింపగలమా!

గాలవు—జాబాలా! శేషతల్పుండల్లదె దివ్యతేజోమయమూర్తిని కన్నుల కఱవుదీఱగాంచుము.

జాబా—గాల—(కరములు జోడించి) ధన్యోస్మి! ధన్యోస్మి!

కీర్తన—హిం తోడిరాగము—ఏక

పల్లవి—దేవా! మముగావ వేగరావా! అయ్యో! ॥దే॥

అను—భావాతీతా! నీదె। భారముసుమ్మా! రమ్మా॥దే॥

చర—నిగమగోచరప్రమేయ । నిర్వికార నిర్వికల్ప సగుణ నిర్గుణచలచర్వ । చర్వత త్రిజగన్మోహన భగవన్నారాయణ! మాం । పాహి! పాహి! సదానంద ॥దే॥

(2) నిన్నుదెలియ లేరెవ్వరు । నిరుపమాన భూతదయాపన్నరక్షకుండవనగ । బ్రహ్మానుపవయ్యా! మాను కన్నులార చిద్విలాస । గరిమజూచు భాగ్యమబ్బె ॥ దే॥

(3) కరుణజూపి బ్రోవుమయ్యా । కలుషములెల్లను బాపియు శరణార్థుల రక్షింపగ । శరధిమూనినావు కావె ।పరమాత్మ రామసుకవి । పరిపాలా! నందనములు ॥దే॥

విష్ణు—మునిపుంగవులకభివందన మొనర్చుచున్నాడను.

జాబా—గాల—దేవాదిదేవా! దీనశరణ్యా, మాం పాహి! మాంపాహి! (అని నమస్కరింతురు)

విష్ణు—ఋషిసత్తములారా! మీజపతపహోమాదులెల్లప్పుడు నిర్విఘ్నముగా సాగుచున్నవా? మీకెల్లరకు క్షేమమేకదా?

జాబా—తండ్రీ! ఆదినారాయణా, సర్వమయుండవగు నీవెరుంగరాని యంశమీ పిపీలికాది బ్రహ్మపర్యంత మొండైన నుండునా? సర్వమెరిగిన నీవే మావలన వినదలచుకొన్న జెప్పకూరకుందుమా? వింటివికదా, హిరణ్యకశిపుడను క్రూరదైత్యాధముని నామము?

విష్ణు—అవునా? నేనింతకుమున్న యాక్రూరుని ప్రవర్తన మీదేవేంద్రునినోట వింటిని. ఏమేమీ! నిరపరాధులగు మిమ్ములనుకూడ నాక్రూరరాక్షసుడు హింసించెనా యేమి?

గాల—దేవా! చెప్పుకొనుటకొక్క హింసయే కాదు. క్రూరదైత్యునిమాటకేమిగాని, వానిపరివారము బందలుగాను మమ్మెక్కడ నిలబడనీయకున్నారు.

సీ. కంబుకుడటవాని ♦ చర్యలేమని జెప్ప
వారమునీకు దే ♦ వాదిదేవ

జాబా—హరిని జూపుదటంచు ♦ శిరమువంచియుగుద్ది
బడద్రోసివరుసగా ♦ బాదినాడు

గాల—తపమేలరామీకు ♦ జపమొందులకటంచు
హోమకుండంబులం ♦ దుమిసినాడు

జాబా—ఆశ్రమంబులగాల్చె ♦ నాశాలగోపాల
మదలంగదఱిమె కా ♦ రడవులందు

గాల—గీ. నీచకృత్యంబులెన్నిమో ♦ నిలువబెట్టి
జేసినాడయ్య!

జాబా— మమ్మింత ♦ గాసిపెట్టి
నట్టివానికి తలపుండు ♦ బుట్టకున్న
సాధుహింసకు ఫలితంబు ♦ జరుగకున్న.

దేవా! మమ్మింతకష్టపెట్టు నాపాపి కెట్టిమార్గమున్నదో తెలియకున్నది.

విష్ణు—మునీంద్రులారా! సాధుహింస యూరకబోవునా! వానిపాపముపండి పటాపంచలగకుండునా!

దేవే—మహాత్మా! ఏమో! త్రిలోకాధ్యుడవు? నీవిందుల కేమాలోచించెదవో? మా ప్రాణమానంబులిక దక్కవని వక్కాణింపుచున్నవాడను.

విష్ణు—ఓయీ దేవేంద్రా! మునులారా! నానుడివినుడు. దుర్మార్గుడా హిరణ్యకశిపుడిక కొలదిదినములలో నిజపుత్త్రవైరమున మడియగలడు అంతవరకు మీరోపికపట్టుడు. భయముడిగి మీమీ నివాసముల కరుగుడు.

దేవే-గాల-జాబా—దేవా! మహాప్రసాదము.

(అందఱు నిష్క్రమింతురు.)

తెరపడును.

తృతీయరంగము—పురవీధి.

[ప్రవేశము—లలితయనుదాసి.]

అబ్బబ్బా! యీ పాడువాయిద్యములకు చెవులు గింగురుమనుచున్నవి దేవుడా? పురమంతా యుత్సవములతో మునిగిపోయినదిగదా? ఇంతగడబిడకారణమేమో తెలియరాకున్నది. ఎవరినైన నడిగి తెలిసికొందమన్న నొక్కనిర్భాగ్యుడు జవాబు చెప్పుడుసరిగదా, నామాటనైన సాంతముగా వినిపించుకొనుట లేదు. నిన్నటివరకు లేని దింతలో నేమికారణమో పట్టణమంతా మారిపోయినది. సరియే, తెలియకుందునా,

వజ్ర—(వెనుకనుండిప్రవేశించిలలితకన్నులుమూయును.)

[నవ్వుచు] సరి, సరి, సందడిలోసందడి నీవొకడవు మాత్రము తీరికగా మిగిలియున్నావనుకొందును. వదలుము బావా; వదలుము. (అని చేతులు విప్పుకొనును.)

వజ్ర—సెహబాస్, గడుసుముండా, నీకాలోచన తక్కువయుండునా? అవునుగాని, మనలోమనమాట నీవెవరి కొఱకీలాగున బయలుదేరినావు?

లలిత—(పరిహాసముగా) నీకొఱకే, కాని, ఏమాకండ్ల కావరము? నడివీధిలో నీకు దాగుడుమూతలా;

వజ్ర—కన్నులేక దాయని పరిహాసముగా మూసినాను బావనుగాదా? నాకామాత్రపు స్వతంత్రతకూడదా?

లలిత—నీబుద్ధి బుగ్గిలాగేయున్నది. నోరుమూయుము.

వజ్ర—నీనోరా, నానోరా, లలితా, నామాట కంతకోపమెందుకే? వీరుడనుగదా నన్నంతమాటనవచ్చునా?

లలిత—అబ్బో, మహావీరుడవు బయలుదేరినావు, వెనుక లీలావతిదేవిగారి నిందుడు చెఱగొనిపోవునప్పు డీవీరు లందఱు జచ్చిపోయినారుగాబోలునే?

వజ్ర—వెర్రిదానా, ఎంతచెప్పిపడిచినావు? దొంగపోటునగొంపోయినాడుగాని, లేకున్న నిందుడు గిద్రుడు నాకులెక్కా, నాపరాక్రమమెఱిగి మాట్లాడినావే?

లలిత—[విసుగుతో] అబ్బా, నీదిక్కుమాలిన గొడవకేమికాని, నేడింత తొందరగా దిరుగులాడుచున్నావేమి?

వజ్ర—కోటలో నుత్సవము తొందఱలోనున్నాను.

లలిత—బావా, ఈయుత్సవములేమిటి? ఈగడబిడలేమిటి? నాకీసంగతి కొంచెము చెప్పవా?

వజ్ర—లలితా, నీ కీయుత్సవము సంగతులే తెలియవుగాబోనునే? అన్నట్లు మఱచితిని. నీవీమధ్యగ్రామాంతరమున కేగినట్లు తెలిసినదెప్పుడువచ్చితివి?

లలిత — బావా, మాచెల్లెలుగారింటికి వెళ్ళి నిన్ననే బయలుదేరి వచ్చితిని.

వజ్రి — సరి, సరి, అయినచెప్పెదను వినుము. మన మహారాజుగారి పుత్రుడు ప్రహ్లాదు నెరుగుదువా?

లలిత — ఆ, కొంచెము చెప్పుకొనుట ఎరుగుదును.

వజ్రి — ఆబాలుని పంచవర్ష ప్రారంభదినమని నేటి రోజున పురమంతా యుత్సవము చేయుచున్నారు

లలిత — (ఆశ్చర్యముతో) బావా, ఆబాలుని కప్పుడే యైదవయేడు వచ్చినదా? నీమాట చాలా చోద్యముగానున్నదే?

వజ్రి — ఎంతకాలమాయెను. నీవు నిన్నటివరకు చిన్నపిల్లవు. ఇప్పుడెక్కడలేని వన్యాహారములు సేవియే, ఏసందిగొందులలోజూచినా నీవే!

లలిత — చాలు, చాలు, అధికప్రసంగము చేయబోకు యొడలు మానసికి నూరకుందుము.

వజ్రి — నీకు మందు ఎంతసేపు? చల్లారు టెంతసేపు?

లలిత — దానికేమిగాని బావా, మనపురజనులందఱా బాలునిగురించి విపరీతముగా జెప్పుకొందు రేమి కారణము?

వజ్రి — కారణమున కేమున్నది. జన్మించినదాదిగా నా బాలుడు శ్రీహరి నామస్మరణ మానకున్నవాడు. మనమహారాజుగారి కామత మెంతమాత్రమును గిట్టదు. అందువలన

చూడబోయిన వారెల్లరాబాలు నెట్లయిన నామార్గమునుండి మరల్పజూచుచున్నారుకాని ప్రయోజనములేకున్నది.

లలిత—సరి, సరి, ఇదియాసంగతి. అక్కడక్కడ కొంచెమీసంగతివిన్నాను కాని పూర్తిగా తెలియలేదు.

వజ్రి—ఇదేకాదు, ఇంకను మరొక రహస్యమున్నది.

లలిత—ఏమారహస్యముబావా,

వజ్రి—ఎవరైన విన్న ప్రమాదమువచ్చును చెవిలో జెప్పెద నిటురమ్ము.

లలిత—దొంగముండాకొడుకా, ఇదియా నీవేషము, నాకుపనియున్నది. పోవలయును.

వజ్రి—లలితా! ఒకముద్దివ్వవా?

లలిత—బావా, ఇదిగోముద్దు. (అని తలపమీదకొట్టి పోవును)

వజ్రి—(కోపముతో) టక్కరిముండా, కొట్టిపోదువా కానిమ్ము నీపనిబట్టుకున్న నాపేరు వజ్రిసింహుడేగాదు—

(నిష్క్రమించును)

(తెరపడును)



శ్రీ

శుభమస్తు—అవిఘ్నమస్తు

శ్రీ పంచముఖి వీరహనుమాన్ శుభ్యన్నమః

# ప్రహ్లాద

## నాటకభజనకీర్తనలు



### ప్రథమాంకము.

ప్రథమరంగము—అంతఃపురము

(ప్రవేశము; లీలావతి, ప్రహ్లాదుడు)

లీలా—ముక్కుపచ్చలారని యింత వైరాగ్యమేల నోయి?

ప్రహ్లా—అమ్మా! శ్రీహరి కృపారసము చేత—

లీలా—అయ్యయ్యో! నిన్నా హరినామస్మరణ మానుమనియేకదా మొత్తుకొనుచుంటిని.

డైలాగ్.

కీర్తన—హిం॥ ముఖారిరాగము—తిశ్ర

పల్లవి—వలదు వలదురా! హరినామస్మరణ ॥వ॥

అను—బలుపగు నీతండ్రికతడు। పగవాడని తెలిసికొనుము ॥వ॥

చర—తలపుముననిజనదాట । తల్లినిగద నామాట ని
లువబెట్టు మన్యాయము । నీకిదేల వైరాగ్యము ॥వ॥

ప్రహ్లా—జననీనాజన్మములో । జలగూర్చినవైరా
గ్యము మనమున విడి సేయబోవు నా । కలుషములగు మా
ర్గములను బోధింపకు ॥జ॥

లీలా—వినుమునీకు చిన్నతనము । జనదుకొడుక పెంకి
తనము । ఘనతగాదు మానురామ । కవివరనుని ధ్యాన్న
మింత ॥వ॥

ప్రహ్లా—తల్లీ! నేనామహనీయుని మఱతునన్నను మ
ఱపురాకున్నవాడు నన్నేమి చేయుమందువు?

మ॥ పరమాత్మున్ దశకంఠార్త రక్షకు సన్ను♦ పాద్మాసనాన్ని నముం
దరగన్నట్టుచు తాండవానుసాలుపున్ ♦ దాసోహముజ్జేయనా
హరిదీవింపుచు రాగిలించుకొనిపో♦ దాలెమ్ములెమ్మంచు
ముం
గురులన్ దువ్వియుముద్దుపెట్టుకొని మే ♦ ల్కొల్పుగా గదా
తల్లిరో.

అట్టిమహనీయుని నేనెట్లు మఱతునమ్మా!

లీలా—తండ్రీ! అట్లనుట సరియా! ఇంతపిన్నవయస్సు
ననే నీకింత వైరాగ్యమా?

ఉ॥ బాలకులాటపాటల స్వ ♦ భావముజూడగ తల్లిదండ్రికిన్
చాలముదంబుగల్గు నని ♦ శంబటువంటిదిదేమి పాపమా

లీల విరోధివాటకు చ ♦ లింపవు; పంచవయస్కుడీవు; గ
ర్గోలాసరింపకన్న విన ♦ గోరవు క్షేమ మెఱుంగవక్కటా॥

నాయనా! నీజనకునకతఁడు బలవద్విరోధియనుచుండ మాటి మాటికా హరినేల బొగడెదవు?

ప్రహ్లా—తల్లీ! దూషణభూషణ తిరస్కారంబులు శరీరంబునకుగాని, ఆత్మకు లేవను పరమార్థమెఱింగియు, భగవంతునియెడనవివేకముగా మాట్లాడిన నీకేమని జవాబివ్వగలను? ఎన్నడు నీవట్లుమాత్రము వచింపకుము.

(ప్రవేశము; హిరణ్యకశిపుఁడు)

లీలా—(చూచిలేచి) నాథా! నమస్కారము. (నమస్కరించును)

హిర—సుగుణాలీధవ! దేవీ! చిరంజీవి ముచ్చటించు ప్రసంగమునకిట్లు వచ్చితి ననుకొనుచుంటిని.

లీలా—ప్రాణేశ్వరా! ప్రసంగమున కేమున్నది. ముద్దుముచ్చటలకైన, నవ్వుకు, తుఱ్ఱుకుగదా? నిరంతర మేదియో మౌనవ్రత మవలంభించియుండును.

హిర—దేవీ! పంచవయస్కుఁడగు వీనికీ పాపుభక్తియలవడుట మిగుల చిత్రముగా నున్నదిగదా? (కుమారునుద్దేశించి) తండ్రీ! ప్రహ్లాదా! నీతోడి బాలురాడుచు, పాడుచు నెంతయో విలాసముగనుందు రట్టి నీవేల నిట్లు మౌనవ్రత మవలంభించియుందువు?

ప్రహ్లా—తండ్రీ! భక్తవరదునితో నేనల్లప్రొద్దు నాడు చు బాడుచునే యుందును.

హిర—ముగ్ధులయ్యా! నీకావిరోధి చింతనయేల? ఆడుకొనుటకు నీకెందరున్నారుగారు? నాకన్న వాడేమి గొప్పవాడా?

ప్రహ్లా—జనకా! నీకన్న నేకాదు. లోకాతీతుడన బరగువాని కొరులు లెక్కయా? వానికిని మనకును హస్తిమశకాంతరమున్నదని నుడువగలను.

హిర—ఓహో! నీమెట్టవేదాంతమంతకంతకు ముదురుచున్నదే? అప్రశంస నికగట్టిపెట్టుము

డైలాగ్—కీర్తన—ధన్యాసిరాగం—చతురశ్రి.

పల్లవి—నామాట నాలించి కేశవుని । నామమింకదల పెట్టకు తండ్రి ॥నా॥

అను—నీమూర్ఖతనము విడచి దానవ । నీమమూని వర్తించుట శ్రేయము ॥నా॥

చర॥ ఖలుడతండు మనవిరోధిగావున । కర్త్రిగట్టి నిగ్రహింప సమయము । దలచి చేటము బూనవలయు నీ పిన । తండ్రినకట మాయజేసి చంపెను ॥నా॥

ప్రహ్లా—నిగమగోచర ప్రమేయనంతుని । నిరుపమైన మఱువలేను జనకా ।

లీలా—తగదు తగదు తండ్రిమాటవినుమా । తనయుతే నుమెరిగి బ్రదుకుమకటా॥

హిర—పొగరడంతునింక హరిని నిన్నును । పోరనీచవంశఘాత కుండవు ॥నా॥
పెక్కుమాటలాడితివేని, నీతల ద్రక్కులగునని యెరుంగుము.

లీలా—నాథా! శాంతింపుడు! నోరెరుంగని పసివాని యెడ నింత కార్పణ్యమా! నెమ్మది మీద వీనిమతిమును ద్రిప్పవచ్చును.

హిర—దేవీ! వీని నిక నూరకుండరాదు. గురుశిక్షవడ సినగాని కార్యము ముదురుచున్నయది.

లీలా—అట్లయిన శీఘ్రమే విద్యాభ్యాసన చేయింప వేడెదను.

హిర—సంచిది. మనపురోహితులు చండామార్కుల కప్పగించి విద్యాభ్యాసము చేయింతును.

లీలా—చిత్తము? అవశ్యమట్లొనరించుటయే ముఖ్య కర్తవ్యమని నాకును దోచుచున్నది.

(అందఱు నిష్క్రమింతురు)

ద్వితీయరంగము—బడిచావడి.

(ప్రవేశము:—చంద్రుడు.)

అబ్బబ్బా! ప్రతిదినమీ అల్లరికుంకలచే బాధపడలేక జచ్చిపోవుచున్నాను దేవుడా! బడినూనుకొందమన్న రాజాజ్ఞ నతిక్రమించిన వాడనగుదునేమోయని భయమగుచున్నది.

సీ. బడికి వేళకు రాక ♦ బయట నాడుచు దోడి
బాలుర న్నెరచు ని ♦ ర్భాగ్యుఁ డొకఁడు
మత్తుగాదిని నిద్ర ♦ మరిగి చంపినగాని
పాఠముల్ జదువని ♦ బండయొకఁడు
తల్లిదండ్రుల నేపి ♦ తన్నులుఁ దిని సిగ్గు
మీసమైనను లేని ♦ వెధవయొకఁడు
పుస్తకంబులు పలక ♦ పుల్ల లెవ్వరివైన
దొర్లించుకొనునట్టి ♦ దొంగయొకఁడు
తే. గీ. చాపలకు సూదులను గ్రుచ్చు ♦ చవటయొకఁడు
గోచులను లాగి డల్లరి ♦ కుంకయొకఁడు
బూతులాడియు బరువెత్తు ♦ కోతియొకఁడు
వీధిబడుల గురుత్వంబు ♦ బాధగాదె.

నాకెంత బాధయున్నను నిదితప్పకున్నది. పురోహితము నించియో, నా నడవడి యందభిమానమునచియో, హిరణ్యకశిపు మహారాజుగారెంతయో, నన్ను గౌరవింపుచున్నారు. అదిగాక, వారి ప్రహ్లాదకుమారుని నాకప్పగించి, విద్యాప్రవీణునిగా నొనరింపుమని సెలవిచ్చియున్నారు. (ఆలకించి) అరుగో! అరుగో! కోతిమూక వచ్చుచున్నది. నేనొక క్షణము లేకున్న బడి, బజారుక్రింద మారిపోవునుగదా?

[ప్రవేశము ఒకరినొకరు గెంటుకొనుచు బాలురు.]

చండు—(మూఁది) ఓరీ! వెధవల్లారా! ఏమిటిరా! ఆ గందరగోళం? ఆలాగునొకరినొకరు గెంటుకొనకపోతే తిన్నగా రాలేరటరా? నెమ్మదిగావచ్చి కూర్చుండుఁడు.

సుందరం—మేష్టారండీ! సూడండి! కరాళంగాడెలాగ నాయీపు గీసేసేడో! రక్త మొస్తుందండి! మంటెకుతుందండి బాబోయి! (అని యేడ్చును.)

కరాళం—అబ్బే! నేనుగాదండి మేష్టారండీ! దొంగ తనంగా సందిలో బేమ్మగోరిదొడ్లో నారింజకాయలకోసం మను రెక్క గోడ యెక్కేడండి! అప్పుడు పెట్టుముల్లు గీసుకుపోయింది కాబోసండి!

చండా—ఏమిరా! దొంగ వెధవా? గోడమీదనుండి క్రిందికురికినావా? లేదా? (అని కొట్టును.)

సుందరం—లేదండిబాబోయి! మేష్టారండోయి! సూరి గాడున్నాడడగండి! ఏమిరా! సూరిగా, నేను గోడ దూకేనటరా

సూరి—నాకు నారింజకాయ లెట్టేవా? మేష్టారండీ! గోడ దూకేడండీ, వరిసీ సూడండి.

చండ—అల్లరి వెధవల్లారా, చదువుసంధ్యలు లేక పోయి నా గుర్రిస్తులాటమూతగిరా వచ్చును. తిన్నగా కూరుచుండండి.

నాగన్న—మేష్టారండీ, బుచ్చిగాడు సూడండి, నా పొత్తక మెలాగ సింపేసేడో? (చిరిగినపుస్తకమును చూపును)

చండు—ఓరీ, వెధవనాగన్నా, కూర్చుండరా, మీ తగవులు తీర్చలేక చచ్చిపోతున్నాను. ఒక్క క్షణమైనా నెమ్మదిగా నూరకుండరేమిరా? ఓరీ, సుందరంగా, మీతమ్ముడ్ని తీసుకొనిరాలేదేమిరా?

సుందరం—మేష్టారండీ, మరండీ, ఆడు రాత్రి డోకొచ్చి బోయాడండి, యీ యేలకి మాబాబెల్లొస్తన్నాడండి.

చండు—ఓక్కరి వెధవా, మధ్యాహ్నముతిస్కు—నిరాశ పో, నీకుని జూచెదను. ఓరీ, ఏడిరా, మొద్దబ్బాయి ఖాలే దేమిరా?

కరాళం—మరండీ, మేట్టారండీ, ఆళ్ళమ్మ బళ్లోకెళతా వా, లేదా యని చావకొడుతున్నా రావడంలేదండి.

చండు—ఓరీ, మీలో నలుగురు వెళ్ళి కాళ్ళుచేతులు కలగట్టి ఆవెధవను తీసుకొనిరండి. చప్పున వెళ్ళండి.

[నలుగురు బాలురు పరువెత్తుదురు.]

చండు—ఓరీ, సుందరం, ప్రార్థన చెప్పరా, అందరు లేచి నిలబడండిరా. [బాలురందరు లేచి నిలబడుదురు.]

సుందరం—

క. జనకుడు, జననియు, దైవము
ఘనుడగు ప్రభువాహిరణ్య • కశిపుండనగా
దినమును మొక్కెద నెల్లర
మును దయనమ్ము బ్రోవుమనుచు • మోక్షంబొసగన్.

అందఱు—(క్రమముగా ప్రార్థన చేయుదురు.)

(తెరలో కలకలము)

చండు—(ఆలకించి) అదుగో! గుడికి మేకపోతువలె న అచుమా, వచ్చుచున్నాడు. ఆమొద్దువెధవ వయస్సునకు నా కంటె పెద్దవాడు. డొక్కచీరితే అక్షరముమాత్రము లేదు.

(మొద్దుఅబ్బాయిని లాగుకొనివత్తురు)

ముద్దు—(కొబ్బరికాయముక్క తినుచు) అయ్యబాబోయి! బాబోయి! యీ రూలమేస్ట్రారి సేతుంలో కొత్త బెత్తమున్నదండడరోయి! నన్నిడిసికెల్లకండరోయి! మీకెంతయినా పున్నెముంటుంది బాబోయి! మామామ్మ సచ్చిపోయేకే ఖర్మాకు నేను లోకువై పోయానరోయి! (అనియేడ్చును)

చందు—(చూచి) ఓరీ! ముద్దువెధవా! అంతగొంతు చీరుకొందువేమిరా? నోరుమూస్తావా! తన్నమనెదవా! (కొట్టును)

ముద్దు—(పెద్దగొంతుకతో నేడ్చుచు) బాబోయి! బాబోయి! మేస్ట్రారండోయి! మీపాదాలకు దండాలెడతానండోయి! నన్నురచ్చించండి మారాజోయి! మాఅమ్మోరిదేలకెల్లొద్దండండి బాబోయి! దొడ్లోపనిసేసుకుంటూ నన్నీధిలో కాపుండమందండి బాబోయి!

చందు—ఛీ! దొంగవెధవా! నోరుమూయుము (మరలకొట్టును)

ముద్దు—మేస్ట్రారండోయి! కొట్టకండిబాబోయి! నాకు జరంవస్తే మానదండి మారాజోయి! ఇక బరిమానితే వట్టండి బాబోయి! సేతుల్లోసెయ్యేత్తాను పట్టండి! మీకు బెల్లంముక్కతెచ్చిత్తా నండిడిసిపెట్టండి దేవుడోయి! (ఏడ్చును)

చందు—ఓరీ! వాచాటా నాకులంచమిచ్చెదవటరా? నీపలకపుల్లనిటు తెచ్చుకొమ్ము.

గుర్వ—ఇదిగోండి (అని పెద్దబల్లయు, రూలకర్రయు యిచ్చును)

చండ—షభాష్! నీ వేషము నీబిరుదునకు దగినట్లే యున్నది. కూర్చుండుము. ఓరీ! శామిగాడేడిరా!

నాగన్న—శామిగాడు కాలిపోయాడండి! నాకావొదవ సమువురాదు. నేను బళ్లోకి రానంటున్నాడండి!

చండ—ఓరీ! సూరిగా ప్రహ్లాద కుమారుడింకను రాలేదు. నీవుపోయి దీసికొనిరమ్ము.

నాగ—నేనెల్లానండీ! (లేచబోవును)

చండ—ఛీ! వెధవా! నోరెత్తక కూర్చుండుము. సూరిగా. వెళ్ళవేమిరా?

సూరి—ఇదిగోనండి వెలతున్నానండి (నిష్క్రమించును)

చండ—ఒరే! కరాళం! ఒరే! సుందరం! మీపాఠము లప్పజెప్పండిరా?

కరాళం—చిత్తమండీ! నాకు కొత్త పాఠం రాలేదండి పాతపాఠాలక్కర లేదన్నారు కాదండి! అందుకు మరిసిపోయానండి!

సుందరం—నాపాఠం యింటికాడ పొత్తకంలో ఉండిపోయిందండి! ఎల్లితేనాండీ!

చండ—దొంగవెధవల్లారా! ఎక్కాలో?

సుందరం—ఎక్కాలసలే తలకెక్కటం లేదండేమో కాని రాత్రి నిద్రోతూకూడా సదివేను.

చందు—నిర్భాగ్యుల్లారా, మీకిక చదువురాదురా?

నాగన్న—సదువురాపోతే మేమొందుకు పనికొత్తా ఉండీ?

చందు—వెధవనాగన్నా, నోరుమూసుకొని కూర్చుండలేవటరా? (కొట్టును)

నాగన్న—బాబోయి, బాబోయి, మేట్టారండోయి, దండమండోయి, (అనికూర్చుండును)

(ప్రవేశము:-ప్రహ్లాదుడు, సూరిగాడు)

ప్ర—గురువర్యా! నమస్కారము (నమస్కరించును)

చండా—దీర్ఘాయురస్తు శీఘ్రమే విద్యాప్రాప్తిరస్తు. వత్సా! రమ్మా! కూర్చుండుము.

ప్ర—చిత్తము. (కూర్చుండును)

చండా—నాయనా! ప్రహ్లాదా! నిన్ను మీతండ్రిగారెంతయో విద్యాపారీణుని జేయుమని, నాకప్పగించినందులకు నేజెప్పు శాస్త్రములను పఠింపక నిక్కడి కైదుమాసముల నుండి మౌనముద్రను వహించియున్నావు. కారణమేమియో తెలియరాకున్నది.

ప్ర—గురువర్యా! దైవనిరోధములగు తమశాస్త్రార్థములు నాకంతగా రుచింపకున్నవి.

చందు—ఏమీ! నానుడు శాస్త్రములకన్న నెక్కువ విద్య నీకడనున్న దందువా?

ప్రహ్లా—అట్లని నేజెప్ప సాహసి పను! నామతమునకు వ్యతిరేకభావముగానున్నదని మాత్రము స్పష్టీకరింతును.

చండ—నాయనా! నీకొకభావము వేరుగా స్పష్టింపబడియున్నదా? ఆభావమేదియో విశదపరపుము

ప్రహ్లా—దేవా! నాకొక్కనికే గాదీసకల ప్రపంచముకా ఆకేర్పరుపబడియున్నదా తత్త్వము!

కీర్తన—కళ్యాణిరాగం—తిశ్ర.

పల్లవి—తత్త్వము బోధింతునయ్య । దయ నాకగ్గింపుమయ్య ॥త॥

అను—సత్త్వరజస్తమోత్రిగుణ ♦ సర్వేంద్రియ రహితంబగు ॥త॥

చర॥ నిగమాగోచరపరమేయు ♦ సర్వకారణసర్వకల్పు
సగుణ నిర్గుణాకారుని । సచరాచరపరిపాలుని ॥త॥

2. నాదబిందు కళాతీతు । నారదాదిమునిపూజితు
వాదభేదశూన్య శ్రీని । వాసునిత్య చిద్విలాసు ॥త॥

3. తనుభావయశోవర్ధను । ధర్మాధర్మవిచక్షణు
ఘనుడు రామకవివరదుని । కళ్యాణ పరంధాముని ॥త॥

నిరంతరమట్టి మహానీయుని "ఓం నమోనారాయణాయనమః" యనుమంత్రరాజమున భజించి ముక్తులగుటయే శ్రేయోదాయకమని పరిశుద్ధాత్ములకు లాదటనికి దెలియును.

చండు—పిన్నవయస్కుడవగు నీకీ మెట్టవేదాంత మెవరు నప్పిరి? బాలకా! చాలుచాలు "ఓంహిరణ్యకశిపవేనమః" యనునదే సర్వమునకు మంత్రరాజమైయుండ నీవిట్టిపిచ్చి తలంపునొందకుము! ముక్తులగుట కదితప్ప మఱివేరుమార్గమే లేదని గ్రహించుము.

సుందర—ఓరే! మనవేలాముడు పాడే పాటలు మా బాగా ఉన్నయిరా! పంతులుగారు సదువు సదువు అంటూ వీపుకట్టపడడమే కాని మరేం లేదురా! రండిరా! ఇలారండిరా

(బాలురు గుమిగూడుదురు)

చండు—ఓరోరి! భ్రష్టులారా! మీరంద ఱేండులకు గుమిగూడినారురా? (అనిపుట్టి తఱుమును)

కరాళం—మేష్టారండోయి! మేష్టారండోయి! మా! రాజుగారొస్తున్నారండి!

చండు—(చూచి) అల్లరి చేయకుడు! కూర్చుండుడు.

[ప్రవేశము: హిరణ్యకశిపుడు.]

చండు—దేవా! దయచేయుడు! తమరా పీఠమలంకరింపుడు.

హిర—(పీఠమధిష్ఠించి) నాయనా! ప్రహ్లాదా! ఇటు రమ్ము. [చేరదీసి శిరము మూర్కొని] గురుతిరస్కారమొనరింపక జదువుకొనుచున్నావా?

ప్ర—తండ్రీ! శ్రద్ధగానే జదువుకొనుచున్నాను.

హిర—వత్సా! నీవింతవరకు నేర్చిన గ్రంధములలో నొకపద్యమును శ్రవణానందముగా జదువుము.

ప్ర—

మ. వినుమీదేహ మశాశ్వతంబనగ ని ♦ విశ్వాంబుమాయా ప్రభో! ధనమైశ్వర్యము చంచలంబగుసుమీ ♦ దారా సుతుల్బాంధవుల్! గనపూర్వోక్తబుణానుబంధము; సుఖదుః ఖాలాపముల్ వ్యర్థముల్! జనకా! శ్రీహరినిత్యుడంచు మదిలో ♦ జర్చించిభాషించెదన్.

హిర—(ముందునకుద్రోసి) ఛీ! మూఢుడా, వలదనిన బలుమారతనినే శ్లాఘించుచున్నావు (చండామార్కులను జూచి) గురుడవని నమ్మి కుమారు నప్పగించినందులకు విరోధి మార్గములను మతికెక్కించుట మీబోంట్లకు బాడియా? రాజ ద్రోహ మొనర్పవచ్చునా? విశ్వాసముండవలదా?

చండ—ప్రభూ! క్షమించుము తమనెయుకోరియున్న నేను వ్యతిరేకముగా నడచుకొందునా? కొలదిదినములలో వీని మతముద్రిప్పి దేవర మెప్పువడిసెదను.

హిర—మంచిది. వీని నేక్రియనైననా పాడుమతము నుండి మరల్పవలయు నేనిక నరిగెద.

చండ—చిత్తము. (హిరణ్యకశిపుని సాగనంప కొంత దూరమరగును.)

చండ—ఓరోరి! భ్రష్టులారా! మీకీభజనా! మీతాళము పట్టుచునెదరా! అక్కడనుండి లేచిపోతారా! (ప్రహ్లాదునిజూచి) ప్రహ్లాదా! నీవరుస యేమియు బాగుగాలేదు. “తాజెడ్డకోతి వనమెల్ల జెరచె” నన్నట్లు తోడిబాలురనుకూడ పాడుచేయుచున్నావు. కొలది దినములుచూచి మీతండ్రిగారి కీయుదంత మెరింగించి నిన్ను శిక్షింపజేతును జాగ్రత్త.

ప్ర—గురువర్యా! మీచిత్తము! మీరేమిచేసినను చేయుడు! నేనుమాత్రమా శ్రీహరినామస్మరణ మానను.

చండు—కానిమ్ము. నీమతమెట్లు మారకుండునో చూతును. ఇక నీపూటకు బడివదలివేసితిని. మధ్యాహ్నము ఆలస్యముచేయక రండు.

[అందరు నిష్క్రమింతురు.]





శ్రీ

శుభమస్తు — అవిఘ్నమస్తు

శ్రీ పంచముఖి శ్రీహనుమాన్ గుర్యస్నకుః

# ప్రహ్లాద

## నాటకభజనకీర్తనలు



చతుర్థాంకము.

రంగము—సభాభవనము.

[ప్రవేశము హిరణ్యకశిపుఁడు, శంబరుఁడు, శకుని, కొందఱు రాక్షసులు.

హిర— మంత్రిశేఖరులారా!

మ. మనరాజ్యంబున నెల్లవారలకు క్షేమంబేకదా! దాస్యజీవనదిక్పాలకులెల్లమూఁడిగపుసే వల్ జేయుచున్నారె, వందనముల్ జేసియు నప్సరాంగనలు నిత్యంబాడుచున్నారె, దుర్జనుఁడా శ్రీహరిజాడఁ గాంచితిరెని స్పందేహులై దెల్పరే.

శకు— రాక్షసేంద్రా! బలవద్రాక్షస విజయుండగు నీరాజ్యమున క్షేమముగాక మఱియొక విపరీతమార్గముండునా? సమీరానల వరుణ కుబేరాదుల నప్రమత్తులరై యుండ నిత్తు

మా? వారికాపి రాడనిత్తుమా? అప్సరాంగనలాడక పాడకున్న వారికి దినములు జరుగవా? దుర్మదుడగు హరిమాత్రమింత వరకు కొలుకడయ్యె? వానికొలు శ్రోతమో విశ్వప్రియత్న మొనరింపుచుంటిమి.

హిర—ఆశ్చర్యమాశ్చర్యము. ముల్లోకములనుగలచి వైచితిని కాని, వానిజాడమైన నిసుమంత గానరాకున్నది. అయినను మనమాతనినమ్మి యేమరియుండరాదు. దొంగపోటున నిష్కారణముగా సోదరునంతమొందించిన శాపాత్ముడు వాడని జ్ఞప్తియుంచుకొనుడు.

శంబ—దేవా! సురాధిపుడు దాచిపెట్టుకొనుచున్న వానికిట్టి నీచప్రజ్ఞయా! సాహసమున్న శత్రువునెదిర్చి బోరాడవలయు లేకున్న రణంబున చావవలయును.

హిర—ఓ వీరా! శంబరా! అతడు బహురూపవేషధారి దనుజకులమంతమొందింపఁజేయుటయే యతని ప్రధమోద్దేశ్యము. కావున మీరతి జాగరూకతో మెలగవలయును.

శంబ—దైత్యేంద్రా! మాకంఠమున ప్రాణమున్నంత వరకు నాహరిని గిరిని లెక్కసేయుదుమనుకొంటిరా? మా యుపాయముల చేతనైన నతని నుక్కడించి తీరెదము కాని యేమరి యుందుమా?

(ప్రవేశము:- ప్రహ్లాదుడు, చండుడు)

హిర—(చూచి) గురువర్యా! నమస్కారము! దయ చేయుడు!

చండు—సుఖీభవ! సుఖీభవ! (ప్రహ్లాదు నుద్దేశించి)
నాయనా! ప్రహ్లాదా! మీతండ్రిగారికి నమస్కరింపుము.

ప్ర—తండ్రీ! నమస్కారము. (నమస్కరించును)

హిర—దీర్ఘాయురస్తు (చేరదీసి అంకముపై గూర్చుండ బెట్టుకొని శిరము మూర్కొని) తండ్రీ! ప్రహ్లాదా!

చ. గురువులు నీతికోవిదుల ♦ కుంఠితబాహుపరాక్రమదైత్య పో
దరులబురోహితుల్ మిగుల ♦ ధర్మపరాయణు లేమిశాస్త్రముల్
వరుసగ జెప్పిరావిధము ♦ వత్స! వినంగను వేడుకయ్యె, న
చ్చెరువుగ పద్యమొక్కటివ ♦ చించియు భావము వెల్లడించుమా.

ప్ర—తండ్రీ! సమస్తశాస్త్రములను జదివితిని. అన్నిటిసారమును గ్రహించితిని ఇంతయేల! నీకొకపరమార్థ మెఱింగించెద నాకర్ణింపుము.

కీర్తన—యమునాకల్యాణిరాగము—చతురశ్రి.

పల్లవి—దేవా! వినుజగ | దీశుని చరితము ॥దే॥

అను—భావాతీతుడు | ప్రణవాకారుడు ॥దే॥

చర॥ జగమునరంగ | స్థలముననవిరళి | సచరాచరముల |
సంరక్షించెను|
ఖగవాహనభవ | కలుషవిదూరుడు| కమలజాండమెల్ల|
గ్రమ్మియుండెను॥

మిత్రి—నిగమగోచరుడు త్రిగుణాధారుడు | నిర్వికార నిర్వికల్ప నిత్యుడు | భగవంతుని పదపద్మయుగంబుల | బ్రణమిల్లిన నిహపరసౌఖ్యంబగు ॥దే॥

౨. హరినర్చించెడు । కరములు కరములు । నచ్యుతు దవ్వులు మ । నంబు మనంబగు । కరివరదుని గను । కన్నులు కన్నులు । కమలాక్షుని విను । కర్ణము కర్ణము॥

మిత్రి—బరమాత్మునికిదు బ్రీతియు బ్రీతియు । ప్రభుసంకీర్తన భక్తియు భక్తియు । నరిషడ్వర్గము నడచియు బూజ్యత । నందుము దానవనాథా ! ప్రహ్లాద ॥దే॥

హిర—(కోపముతో క్రిందికిద్రోసి) ఛీ! మూర్ఖా! నీ వాడు మతమును వీడనైతివి. గురుశిక్షకులోనయ్యు పూర్వ వేదాంతమునే మరల మరల వాపోవుచున్నావు. ప్రపంచమే మఱచు నీకు గురునాజ్ఞము మాత్రము దెలివి కలుగజేయునా?

చండ—దేవరా! నేనేమని మనవిచేయుదును. నేనెంత ప్రయత్నించినను నీపిపాదునైజము మాత్రము మారకున్నది. క్రమముగా సహపాఠకుల నందఱి నీరీతిగనే మార్చుచున్నాడు.

హిర—(కోపముతో కండ్లెఱ్ఱజేసి) ఏమిరా! నీమతి ద్రిప్పెదవా! దుర్గతి నొందెదవా ?

పైలాగ్—కీర్తన—ఫరజురాగం—చతురశ్ర.

పల్లవి—హరియనిగిరియని ప్రేలకురా । అంతమొందెదవు దెలియుమురా ॥హ॥

అను—కరవాలంబిదె చూడుము మానుము । ఖలునామంబిక దలపెట్టకురా ॥హ॥

మిత్రి—గురునిబోధవినక జనునీరీతిగ । కొంటెతనము జేతువంట తుంటరి । మరచిపొమ్ము వైరిస్తోత్రపాఠము । మాట దక్కదింక నూరకుండను ॥హ॥

ప్రహ్లా—

పల్లవి—జనకా! హరిపై గినియకుమా । జగధీశుని పగదలపకుమా ॥జ॥

అను—వినుమా! మనవిని పెడచెవిబెట్టక । విశ్వంభరు పూజింపుము మేలగు ॥జ॥

మిత్రి—ఘనతగాదు నీమణత్రయంబుల । కాలమెల్ల చీకటి. టిలోబడి । కనుల నితరమేమి జూడలేకను । కాలుసమ్మో పోల్ల నెంచివగచుట ॥జ॥

హిర—వదరుబోత! మారాడెదవా । వైరాగ్యము బోధించెదవా కదలిపొమ్ము రామరాజవరదుని । కధనాడెదవా! బాగజెదవా ॥హ॥

దురాత్మా! కులపాంసనా! నీముఖముచూడరాదు (తన్నును)

ప్ర—(క్రిందబడి) హా! శ్రీహరీ! శ్రీహరీ! (తండ్రి నుద్దేశించి) తండ్రీ! నీవు నన్నింతబాధించినను, జగదేకవీరుడగు పరమాత్మునిమాత్రము దూషింపకుము.

మ॥ నరులీసర్వశరీరధారులిల జ ♦ న్మప్రాప్తి గార్హాస్థ్యము
స్సరసాలాపము దాతిరేకమున సం ♦ సారాబ్ధిలో మున్గియున్
తరుణోపాయము మెఱుంగకంత్యమునమి ♦ థ్యాలోలతన్ మూఢులై
బరమాత్మున్దలియుంగలేరు జనకా ♦ ప్రారబ్ధకర్మంబువన్

చండు—(స్వగతమున) వీనిప్రసంగ మంతకంతకు ముదురుచున్నది. ఇక నేనిటనుండరాదు. (నిష్క్రమించుచు)

హిర—(కోపముతో) మూఢుడా! వలదనినకొలది నోటికివచ్చినట్లు వదరుచున్నావు. మాటిమాటికి పరమాత్ముడు బరమాత్ముడందువు. నాకన్నను బరమాత్ముడింకొకడు గలడటరా?

డైలాగ్.

కీర్తన—పంతువరాళిరాగము—తిశ్ర

పల్లవి—ఓర! దుర్మతీ! నూరాడకనోరుమూయు ॥మా॥

అను—సారసారకును జేరిలేదు । జగధీశ్వరుడనిపెద్దగ ॥నా॥

చర—వీరుడెవడు నాకన్నను । విశ్వమెల్లగరచినాను ।
జేరినాడె నీదేవుడు । చెనటికారులంచెదవా ॥ఓ॥

ప్ర—పల్లవి—గారవింపుమా! శ్రీకరుడా దేవదేవు ॥గా॥
నేరమెంచిదూరవలదు । నిగమగోచరుండాతడు ॥గా॥

చర—వీరుడతడు శూరుడతడు । విశ్వమతడు; ప్రభువతండు । నీరధిశయనుని దెలియగ । నీకునాకు దరము గాదు ॥గా॥

హిర—పొగరుబట్టివాగెదవా! పో! పోరా! కూ్రరాత్మా! జగతిరాము కవివరదుని । జాడజూపుమికజంపెద ॥నా॥ (అట్టహాసముతో) ఏడిరా! ఏడిరా! నీదేవుడేడిరా! (గదతో బాదును)

ప్ర—(ధ్యానమభినయించి) ఆహా! నాతండ్రీ! వచ్చితివా!

సీ. వచ్చితి నా! తండ్రి ♦ వటపత్రశయన! నా
వందనంబిదిగో దే ♦ వాదిదేవ
పాన్పవలంగించి ♦ పరమాత్మ పీనుల
నాలించి నావె; దీ ♦ నారవమ్ము
లరుగిడిరా నేల ♦ పాదముల్ కందెనా
వలెవాటి నెటజార ♦ వైచినావు
ఆయాసపడుచుంటి వయ్యయో! శ్రమదీర
విసరుదు నా! నీకు ♦ విమలచరిత

గీ. జననిసిరి యేది? గరుడవా ♦ హనమదేది?
శంఖుచక్రమ్ముల ఛత్ర ♦ చామరమ్ము
లేవి? పరివారమేదయ్య ♦ నీవె నాదు
కనుల సాక్షాత్కరింప బి ♦ కారివోతె.

హిర—(ఆశ్చర్యమభినయించి) ఆహా! ఏమిది? కడు చిత్రముగా నున్నయది. నాగదాఘాతమునకైన నెఱుంగక భగవన్నామము తలంపుకున నోరులాడుచున్నాడు.

ఉ॥ బాలుడు పంచవర్షముల ♦ ప్రాయమువాడు; విరోధిమార్గమే
లీలను వచ్చె వీనికి చ ♦ లింపడయో గదచేత మొత్తినన్
వ్రాలడు; కన్ను విప్పడు; ర ♦ వంతయు; దేహము స్రుక్కదయ్యో శ్రీ
లోలుని చింతమానడు; బ ♦ లోద్ధతి జంపెదనన్న నక్కటా.

అయిన గానిమ్ము. నా చేతులారం జంపుటకన్న నీక్రూరార్భకు భయంకర విషసర్పములచేత గఱపించి చంపించెద గాక!

వజ్ర—[ప్రవేశించి] దేవా! ఏమిసెలవు?

హిర—ఓరీ! నీవుసత్వరముగ పాములవాని నొకనిని కొన్నివిషసర్పములతోరమ్మని నాయాజ్ఞగా దోడ్కొనిరమ్ము.

వజ్ర—చిత్తము. (నిష్క్రమించును)

ప్ర—[నవ్వుచు] తండ్రీ! ఆపదోద్ధారకుడవను నీనామము సార్థకమగునటుల నన్ను గాపాడబరుగిడి వచ్చితివా? నీదివ్యతేజోమూర్తి నాకన్నులకెంత యానందకరమో వర్ణింప గలనా? నిష్కారణముగా నిన్నెంతశ్రమపెట్టితిని. [స్మృతి నభినయించి] ఏమిది? రాజసభలో నేనెంత యవివేకముగా నడచుచున్నాను? ఇప్పుడిచ్చటేమి జరుగుచున్నది.

హిర—[మండిపడి] ఛీ, కులటా, ఏమిజరుగుచున్నదా? నీపాపము పండి పంచాపంచలగుటకు సిద్ధముగానున్నది. నోరుమూయుము. [అని నోరు మూయుచు]

ప్ర—హా, భువనైకసుందరా, పరమాత్మా, నాజనకు డిమునిముములకు, కనుదడబడుచున్నాడ రక్షింపుము

[ప్రవేశము నాగస్వరమూదుచు పాములవాడు, వజ్రకంఠుడు.]

పాము—దొరగోరండి, దండాలండిబాబు, దండాలండి.

[అని నమస్కరించును.]

హిర—ఓరీ, నీకడ భయంకర విషసర్పము లేమైనను గలవా?

పాము—బాబూ, దొరగోరండి, లేకేయుండిబాబు, ఇయిగో, సూపుతానుసూడండిబాబు. [నాగస్వరమూదుచు]

కీర్తన—ఖరహరప్రియరాగం—ఏక.

పల్లవి—లేరా, నాగన్న, దొర । గోరు బగుతు
తిర్తారు ॥లే॥

అను—బారపాడుగులోకమీద । పడగిప్పి లేపాడు॥

చర॥ కొత్త తాసుదీని తసా । గ్గొయ్య సిర్త గించండి
కత్తి మీదసాముండి । కాముందులదయలేండి ॥లే॥

2. కొండతాసునల్లతాసు । కోడితాసు, తెల్లతాసు
మొండికంటితాసుగాక । మెజ్జతాసు, సుక్కతాసు
మొండిలోక నాగునల్ల । ముట్టితాసులియిగోండి ॥లే॥

3. ఇసనప్పములుండిచాల । కసిగనుందునండి । పీటిపసపు
బువ్వులుసూడండి । బయిటికొత్త సిలవిండి ॥లే॥

4. మనవిసేతుబాబయ్యా । మాయబకుకురత్తకూడు
దినముపొట్టకొరకు పబుల । దేవిడీలకాపుండియు
ఘనుడు రామకవిదేవుని । కాళ్ళకెపుకు మొక్కుతాము॥

ఏలినోరిచెలవుకోచం సూత్తున్నానండిబాబు.

హిర—ఓరీ, విషసర్పము నొక్కదానినిదీసి దురాత్ము
డగు నీయర్భకుని గఱపించిచంపుము.

పాము—అయ్యబాబో, అహ్యోరు, యింకేమయినా
బుల్లిఅబ్బాయిగారి ఆచలుంటాయాండిబాబు. యిచమొక్కం
దంటే గుటుక్కున పానాలుగుడ్లనుండి పోవామారాజా
వద్దండిబాబు, వద్దండి.

హిర—ఓరీ, మూర్ఖా, ప్రాణములను దీయుటకొఱకే రావించితిని. సత్వరముగా నాయాజ్ఞను గావింపుము.

పాము—అయ్యో్యాసు! నాకు తెలియ కడగడమండి బాబు! బుల్లిదొరగోర్కి సంపడమెంచాకండి బాబు.

వజ్రి—ఓరీ! నీవధికప్రసంగము చేయకుము. ప్రభువు లాగ్రహింతురు. నీపనిని నీవు నెరవేర్చుకొని పొమ్ము.

పాము—చమించండి బాబు! చమించండి! ఏలినోరి మాటకడుగు దాటలేనాండి బాబు! బుల్లిదొరగోరండి! యీలా రండి! బాబు.

(అని దగ్గఱకులాగును)

ప్రహ్లా—(స్వగతము) లీలామానుషవిగ్రహుండగు శేష తల్పుడు నాయందుండ నీసర్పగములు మాత్రమేమి చేయ గలవు? తండ్రీ! భక్తవరదా!

భైరవరాగము—త్రిశ్ర.

పల్లవి—సమయమయ్యా! నను బ్రోవగ ॥స॥

అను—కమలనయన । గరుడగమన । కలుషరహిత । దేవదేవ ॥స॥

చర॥ చారునయన జావనుంటి । సర్పవిషముచేతనీదె। భార మేమి జేసెదవో । పదములంటి మ్రొక్కుచుంటి ॥స॥

పాము—అబ్బో! కుఱ్ఱయ్యా! నీపదాలుగిదాలు కట్టిపెట్టు. ఇక నా నాగుల తమాసాసూడు! పడగలిప్పి లేసాడి నియ్యాంటే! నాసాయిరంగా! పైపైనాలు పైననే పోవాలి! రా! కుఱ్ఱయ్యా! రా! (అని లాగి స్వరమూదుచు బుట్టవిప్పి) లే! నాగన్నా! నల్లతాసన్నా! వరాలకనులన్నా! పడగిప్పన్నా! (పామును కదల్చి చూచి) అబ్బో ఏంటేసితె్ర! నాగన్నపడుకొని కదలడం లేదేమి సెప్పుమా! కుఱ్ఱాయినికి మంత్రాలొచ్చు నేమోండి బాబయ్య (తెల్లపోవును)

శంబ—ఓరీ! పాములను పైకితీసి, గాలుని కటాపించరా!

పాము—సిత్త, సాబయ్యా! సిత్త, (అని పామును పైకెత్తిబోవ తన్నేకఱచును) అయ్యో. అయ్యో, బాబోయి బాబోయి మారాజో నన్నేయేసి దపిగాణ్ణో, దారగోణ్ణో, యిసమెక్కుతుందండీ బాబో, నాయింటికి కబురెట్టండి బాబో, నాపానాలు కడతేతున్నాయండీ పబువుగారో చెలవిప్పించండి మాయింటికి పరుగెత్తుకు పోతాను మారాజో.

(అని బుట్టతో పరుగెత్తుకొని పోవును.)

హిర—(ఆశ్చర్యముతో) ఆహా! ఏమిది, చిత్రముగా నున్నదే నేదలంచెడు తలపులన్నియు వ్యర్థములగుచున్నవి. పంచవర్షప్రాయుడగు నర్భకునంత బొందింపలేకున్న నాప్రభు నామము కాల్పనా? (ప్రహ్లాదు నుద్దేశించి) ఓరీ వాచాట! నీకు

కాలమాసన్నమైనది. తొందఱపడకుము, నీమంత్ర తంత్రము లు నాకడసాగవని తెలియుము.

ప్రహ్లా—తండ్రీ, లోకైకశరణ్యుడగు సర్వేశ్వరుడే యన్నిటి కాధారుడని యెఱుంగు సుజ్ఞానులకు మంత్రతంత్రము లతో బనేమున్నది.

హిర—మహాత్మా! నీభక్తికంతరాయ మెవర్వు లేవని మాత్రము దలంపబోకుము. నీపోరగములవలన లాభములేక పోయిన పోవుగాక, నీచేతవిషము ద్రావింపజేసియైన నీయసు వులను గొనెద. (ప్రకాశముగా) ఓరీ వజ్రకంఠా!

వజ్ర—దేవా! ఏమిసెలవు?

హిర—నీవు సత్వరమరగి యొకపాత్రలో గరళమును దీసికొనిరమ్ము పొమ్ము.

వజ్ర—చిత్తము.

(నిష్క్రమించును)

హిర—(కోపములో) ఓరీ మందుడా! నీవాహరిభక్తి మానెదవా? విషము గ్రోలి జచ్చెదవా?

ప్రహ్లా—తండ్రీ! సర్వభూతదయాళుడగు నాశ్రీహరి దలంపు మానుటకన్న, బుద్బుదప్రాయమగు నీజీవితముపై నాశవదలుకొనుటయే శ్రేయోదాయకమని మనవిచేయుచు న్నాడ.

(ప్రవేశము; విషపాత్రితో వజ్రకంతుడు)

హిర—ఓరీ! ఆపాత్రను వానికిచ్చి, దానిలోని విష మును ద్రావింపుము.

వజ్రి—దేవా! చిత్తము! రావయ్యా! కుఱ్ఱయ్యా! హరిమాట వినువుమయ్యా! బాబు! ఎందుకు చచ్చిపోతావు?

ప్రహ్లా—(పాత్రను పుచ్చుకుని) ఆర్తత్రాణపరాయ ణా! అన్నిటికిని నీవేగలవు. (విషముచుజూచి) హా! తండ్రీ!

2. గరళమందు నీరూపమె । గానబడుచునున్నదింక । మ
రణమేలగల్గునాకు । మఱతునన్న మఱపురావు ॥న॥

నాకిది మున్నాటికమృతమగుగాక (అని ద్రాపును)

హిర—(ఆశ్చర్యముతో, ఏమిది! కడుచోద్యముగా నున్నది! విషముగ్రోలి చావకున్నవాడింకెవ్విధిమరణించును?

చ॥ గరళముగ్రోలెనమృతము♦కై వడి; రూపముసూరదొందుసుం
దరవదనంబు గందకము ♦ దంబలరారెడు; సొమ్మసిల్లడ
బ్బురముగ శ్రీహరీయనుచు♦బూర్వపురీతిగ మాటలాడు నే
కరణిని వీని జంపుదును♦ కార్యముమించెనికేమిసేయుదుగా.

అయిన గానిమ్ము. ప్రయత్నలోపము మేల నొనరింపవలయు (ప్ర కాశముగా) ఓరీ! వజ్రకంఠా! నీవు మందపాలాది రాక్షసవీరు లతో వీనితెక్కలు విఱిచికట్టి, మహారణ్యప్రాంతమునకు దో డ్కొనిపోయి, కత్తులతో నఱికియు, పర్వత శిఖాగ్ర భాగ

ముననుండి క్రిందికి బడద్రోసియు, మదపుటేనుగుల కాళ్ళచే మట్టించియు, మంటలందు ద్రోసియు, మహాసముద్ర మధ్యమున బడవైచియు, వివిధోపాయములబన్ని జంపుడు. మీరతిశీఘ్రముగా పొండు.

వజ్ర—చిత్తము (ప్రహ్లాదునితో నిష్క్రమించును)

హిర—శంబరా! నేడు నామనంబంతయు బాడైయున్నది. పంచవర్ష ప్రాయుడగు నర్భకు డెన్ని సాధనములనైన జావకున్నాడేమనందును? కానిం దేమి జరుగునో చూచెదగాక. నేటికి కొలువు చాలింతము.

శంబ—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు)

(తెరపడును)





శ్రీ

శుభమస్తు — అవిఘ్నమస్తు

శ్రీ పంచముఖి వీరహనుమాన్ తుభ్యన్నమః

# ప్రహ్లాద

## నాటకభజనకీర్తనలు



పంచమాంకము.



### ప్రథమరంగము — పురవీధి.

[ప్రవేశము: కరములకు సంకెళ్ళతో ప్రహ్లాదుడు,
వజ్రకంఠ మందపాలురు.]

ప్ర—3. కరయుగంబు మోడ్చి నమ । స్కారంబొనరింపలేను
పరమాత్మా! శిరమువంచి । ప్రణుతి జేతు గైకొనుమిదె॥

మంద—ఓరీ! వజ్రకంఠా! నీచేతిలోని కత్తి పదునుగా నున్నదా?

వజ్ర—మందపాలా! పదును గిదు నెందుకురా? మొన్న మనకాళిజాతరకెన్ని మేకలెగిరిపోయిరా! అంతకన్న నీకుత్తు డెక్కువటరా? ఒక్క వ్రేటుతో భూమిమీద బుర్రాడదా!

ప్ర—హా! నాతండ్రీ! నీవెందున్నావోగదా?

సీ. పాలింపవా! మాట ♦ నాలింపవా తండ్రి
కోపమా నే జేయు ♦ పాపమేమి
పగయేలరా కంటి ♦ కనుపింపరా దేవ
నిగమాంతవేద్య మో ♦ నిర్వికార
మరచితివా లేక ♦ విరచితివా నన్ను
కాపాడరావేల ♦ గరుడగమన
ధర్మమా నీకు నా ♦ కర్మమా కాసింత
దయలేదె బలుమారు ♦ దలచుచున్న
తే. గీ. తండ్రిదండించుచున్నాడు ♦ తాళజాల
బాధలకు దిక్కు లేదయ్య ♦ పరమపురుష
కరుణశరణాగతత్రాణ ♦ బిరుదుసార్థ
కముగదరిజేర్పుమిక నమ ♦ స్కారమయ్య.

వజ్ర—కుర్ణో మొర్రో యని యేడ్వకపోతే మీతండ్రిగారు చెప్పినట్లు నడుచుకోరాదటయ్యా, కుఱ్ఱయ్యా ఇంత గొడవెందుకు? చావడమెందుకు?

మంద—అబ్బా, పోనీరా, మనకేమిరా, అయినా గరాళం మ్రింగినోడికిక భయమేమిటిరా? యీకుఱ్ఱయ్య చావుమాటకేమిగాని మనకు తీరికలేకుండా దుంపతెంపుచున్నాడురా బాబు.

[ప్రవేశము: రోజుకొనుచు లీలావతి విద్యుమ్మాష్టి.]

లీలా—హా కుమారా! నవమోహనాకారా! (ప్రహ్లాదుని కౌగలించుకొని యేడ్చుచు) నేనెంతపాపాత్మురాలనురా తండ్రీ.

## డైలాగ్

కీర్తన—జంగ్లా రాగం—చతురశ్రి.

పల్లవి—కన్నతండ్రి నీకష్టము । కన్నులారజూడజాల॥
అను— చిన్నికొడుకతండ్రి కొదురు। జెప్పకన్నవిన వైతివి॥
మిత్రి—పిన్నవు మంచియొ చెడ్డయొ । పెద్దలుజెప్పితి
రంమను। మన్ననసేయక శ్రీహరి । మాట
ను దలుపకమానవు ॥క॥

హరి—

పల్లవి—కనులనీరుబెట్టకమ్మ । కన్నతల్లిభయములేదు
అను—దినములిట్టులుండబోవు। దేవదేవుప్రార్థించుము
మిత్రి। మనమునగుందకు సర్వము । మాయగనెంచుముజ
న్మము । ఘనమునియెంచకు జీవులు । కల్పిత నాటక
బొమ్మలు ॥క॥

లీలా—నిన్నుబాసి నిముసమైన । నిలువలేనురాతనయా।
కన్నకలవుదీర లేదు । గదరా, నాముద్దులయ్య
మిత్రి- బన్నముదొలగియు నాకను । సన్నల మెలగిన బా
లును । చిన్ని కుమారా, ముద్దుల । చిలుకా, కొడు
కా, కొడుకా ॥క॥

ప్రిహ్లా—కనగహరియు వినగహరియు । కాలమెల్ల హరి
తోడను । జననిసంచరింతునాదు । జన్మహరికి దత్త
మయ్యె ।

మిత్రా॥ వినుమిక శ్రీహరివిక వను । విశ్వము పరిశయము
గాని । తన బుద్ధి కొలుత్తై నగవకు । తల్లీ ఋణామిక
దీరెను ॥క॥

హి.——(సంఖముంతో) అయ్యయో! నాముద్దుల తండ్రీ
నీకీ వైరాగ్యమెటనుండి వచ్చెనురా! నాయనా!

సీ. ననుగన్నదాడ్రియో ♦ నాపెన్నిధానమా
నినుబాసి క్షణమైన ♦ నిలువలేను
వలదన్నవినబోవు ♦ వైరాగ్యమేలరా
మానరా నినుబ్రతి ♦ మాలుచుంటి
జనకుని కెమురాడ ♦ జనదన్న! నాయన్న
క్షేమమోబుంగుమా ♦ చిన్నికొమక
కనులార నినుజూచు ♦ కొనలేనూరా ప్రేమ
దీరంగ ముద్దాడ ♦ నేనైతి

తే. గీ. పాలబుగ్గలవాడ వ ♦ రాలమూట
రత్నములరాశి పాపాత్ము ♦ రాలికికను
దీరె ఋణమక్కటా! కట ♦ సారమైన
జూచుకొందును మొగమెత్తి ♦ జూడుమయ్య.

అబ్బా! నాకడుపు పగిలిపోవుచున్నదిరా బిడ్డా! స్వర్ణరత్న, ఖచిత భుజాలంకార మోర్వని నీబాహువులు, రజ్జుబంధనమ్ముల కెట్లోర్చెనురా తండ్రీ! సౌధాగ్రభాగడోలికలదాడులూప సూగుసుకుమార కోమలమగు నీశరీరము పర్వతశిఖాగ్రభాగమునుండి ద్రోల్లంగ నోర్వకుండునట రాపట్టీ! వంశవర్ధ

నుడవగు నీవంటి సుతుని గోల్పోయి, నేనెట్లు మనియుందు నురా నాయనా! అగర్భశ్రీమంతుడ వగుదు వనుకొంటినిగాని, నిష్కారణము నడవిపాలై పోదు వనుకొనలేదురా! కొడుకా! (రోదనము చేయును.)

హరిశ్చ—అయ్యయ్యో! వెఱ్ఱితల్లీ! మందభాగ్యుడనగు నాకొఱకెందుల కేడ్చెదవమ్మా! కట్టా! రాణివాసమైన గణింపనీక, పుత్రమోహము నిన్నింత చేయుచున్నదమ్మా!

డైలాగ్—కీర్తన—హిం, ముఖారిరాగం—త్రిశ్ర.

పల్లవి—విడువ మమ్మరో! నీ। కొడుకను మోహావేశము ॥వి॥

అను—కడుపుబగులు నడలకమ్మా। కన్నతల్లి మఱచిపొమ్మా ॥వి॥

చర। వినుము తనువశాశ్వతంబు। జననమరణములు దేహికి।
ననుభవమే దీనికింత। సాత్పర్యము దేమున్నది ॥వి॥

లీలా—పల్ల—మఱువజాలరా! సుకుమారా! నీ ముద్దుమోము॥మ
అను—నిఱుపేదకు బిడ్డవైన। నీకీగతిబట్టె దేమొ ॥మ॥
చర॥ పట్టభద్రుడౌదు వెపుడో। పరిపాలన జేతువనుచు।
పుట్టెడాశతో నుంటిని। పుత్రా! నిర్భాగ్యురాల ॥మ॥

హరిశ్చ—కలవంటిది సంసారము। కలిమిలేములస్థిరములు
తెలియమాయజగము దేవి। దేవుడొక్కడే నిత్యము ॥వి॥

లీలా—గతమున నేనెంతకట్టి। గర్భశోకమిడినానో।
సుతునికొఱకు నేడిట్టుల। శోకింపుచుంటి నకట ॥మ॥

వజ్ర—చాలు! చాలు! మీయేడుపు లంతకంతకెక్కువగుచున్నవి. మహారాజుగారువిన్న మాకు మాటవస్తుం

దమ్మా! ఇక నాగుటకు వీలులేదు. రావయ్యా! కుఱ్ఱయ్యా! (లాగును)

లీలా—అయ్యో! పాపాత్ముడా! గట్టిగా లాగబోకుము మాయాయన చేతులు నొప్పులుపెట్టును. కట్టా! నాబాగారుతండ్రీ! నీకరములెంతకందిపోయినవిరా!

మాద—ఈమాత్రమునకింత గిజగిజ లాడుచున్నావమ్మా! కనుకున్న శిరముగుఱక, కాలువవలె రక్తము ప్రవహించునప్పుడేమి చేసెదవు?

లీలా—(బిగ్గఱగా నేడ్చుచు) అయ్యో! అయ్యో! నేనేమి చేయగలనుతండ్రీ! నవమాసములుమోసి, నిన్నుగాంచి నీకెప్పటికేలోటు జరుగునోయను భీతిచే స్వయముగా కన్నులలోబెట్టుకొని, పెంచుకొనుచుంటినిరానాయనా! నేటితో నీ ముద్దుముచ్చటలు చూచుకొనుటకు, నాకన్నులు కాలిపోవునా? నీవు నాముప్పుగడపుదువనుకొను యాసలీనాటితోదీరనటరా! కొడుకా!

మంద—అమ్మగారూ! మీపాదాలకు దండాలండమ్మా! కుఱ్ఱాయిన్నిడిసిపెట్టండి! రాజుగారువిన్న మాశిరములూడ్చివేస్తారు. మాబ్రదుకంతయు పోవునుతల్లీ!

లీలా—ఓయీ! ఘడియలమీద మృత్యువునోటబడుటకు సిద్ధముగానున్న నాముద్దులతండ్రి చిలుకపలుకులొకకొంతతడవు వినుటకైన, తల్లికీమాత్రపు స్వతంత్రములేదా! న్యాయాన్యాయ మెఱుంగక యే ప్రభువు మీశిరము లూడకఖండించునా?

ప్రహ్లా—తల్లీ! తీవ్రమగు రాజాజ్ఞ నతిక్రమించియు, వీరి ననుటవలన ప్రయోజనమేమున్నది? అమ్మా! నిష్కారణమేల వెఱ్ఱిపడెదవు?

లీలా—(ఏడ్చుచు) అయ్యో! నాదెంత మొండిబ్రదుకురా! నాయనా, ఎంతఘోరకృత్యము నాకన్నులార జూచుచున్నాను. హా! నాథా, మనకొడుకడవిపాలై పోవుచున్నాడనియైన దయలేకపోయెనా, కడుపారగన్నకొడుకే? వంశవర్ధనుడే, మనము పెంచెడు వృక్షమును మనచేతులతో నఱికివైచుట భావ్యమా, తెలిసియో తెలియకయో, చిన్నతనమగుట నెదిరించినను, మందలింపవలయునుగాని, మరణశిక్ష విధింతురా?

ప్రహ్లా—అయ్యో, నామూలమున నెండకన్నెఱుగని పరమసాధ్వివి నీవెంత క్షోభమొందుచున్నావు తల్లీ, నాకేమియు భయములేదు. నీవింటి కరుగుము.

లీలా—(దుఃఖముతో కన్నీళ్ళుగార్చుచు) అయ్యో నాయనా, నీవు మరణమునకు సిద్ధముగానేగుచుండ నికనాకింటివద్ద నేమున్నదిరా, కన్నకడుపు గాల్చుకొని మొండినై నేనెట్లు భూమిమీద మనియుందునురా.

సీ. నిరతంబు హరినామ ♦ స్మరణసేవానంద
పారవశ్యమున నో ♦ ప్పారుతండ్రి
పరకాంతలను మాతృ ♦ భావంబుగాజూచి
ముదముతో బూజించు ♦ ముద్దులయ్య

కలనైనమరియు న ♦ వ్వులకైన నిసుమంత
బొంకియెఱుంగని ♦ పుణ్యచరిత
సర్వభూతములందు ♦ సమతత్త్వమేర్పడ
నాదరంబునబ్రోచు ♦ నట్టితనయ
తే. గీ. ప్రాయమైదేండ్లలోదీర ♦ నాయువెల్ల
కాలవిపరీతమిట్లుండె ♦ కన్నవాడ
వున్నవాడవునీవె నా ♦ కన్నులిట్లు
గాలెనేమందు నిర్భాగ్య ♦ రాలనకట.

నాయనా! ప్రహ్లాదా! నేనెంతపాపినో, నీబంగారుగిన్నెలో నిం త పెరుగన్నమైనకలిపి చేతితో దినిపించుకొనలేనురాతండ్రీ ! కొంచెము భోజనమైన చేయుమా నాయన్నా!

ప్ర—అమ్మా! నాకు భోజనముక్కర లేదు. నాకాకలి యగుట లేదు.

లీలా—అయ్యయ్యో! అట్లుగాదు. కొంచెము ఫలహార మైనబుచ్చుకొనరా తండ్రీ!

ప్ర—తల్లీ! నాకేమియువలదు. జన్మజన్మాంతరముల నైన నీఋణముమాత్రము దీర్చుకొనలేనని మనవిజేయు చున్నాను.

లీలా—(కన్నీరుగార్చుచు) అయ్యో! అయ్యో! నా తండ్రీ! జన్మజన్మాంతరములకైనను ఋణముదీర్చుకొనలేనను నీపలుకులకు నాగుండెలెట్లుగొట్టుకొనుచున్నవో చూడుమురా నాయనా! ఇక నేనెట్లు జీవింతునురా కొడుకా? దైవము కంటి కి నీ వెంతబరువై పోతివిరావిడ్డా? [యేడ్చును]

హరి—[బ్రతిమాలుచు] తల్లీ! నామాటవినవా! నిన్ను బ్రతిమాలుచుంటినిగాదా? అబ్బా! నీవిక మావెంటరాకూడదమ్మా! పురమువిడచి చాలదూర మరుదెంచితివి. సాగనంపు బంధువులు జలాశయముదాటి రాకూడదందురదిగో, భవాని కోనేరు. నామాటవిని నీవికనింటికరుగుము.

లీలా—(గుండెలుబాదుకొనుచు) తండ్రీ! కనిపెంచి తుదకు నీకష్టము కన్నారజూచుచున్న పాపాత్మురా లీమెకేమి జెప్పుదువునాయనా! (యేడ్చును)

హరి—తల్లీ! నన్నేమిచెప్పమందువు? అబ్బా! నీదుఃఖము చూడజాలకున్నానమ్మా!

సీ. కడుపారగన్నట్టి ♦ కొడుకునుశిక్షించె
నటినీవు పతిపైని ♦ నలుగకమ్మ
జగతీశువైరంబు ♦ తగదంచుదండ్రితో
మంచిమాటగ వాని ♦ పించవమ్మ
అవసానసమయమైన ♦ నధిపుడాహరిజేరు
మంచుఁబేమించి దీ ♦ వించవమ్మ
మాటిమాటికిపుత్రి ♦ మరణంబుమదిలోన
నెంచి కేబనలు చిం ♦ తించకమ్మ
తే. గీ. తీరెబుణమక్కటా! కడ ♦ సారినీకు
వందనముజేయుచున్నాను ♦ డెందమందు
మరణమొందుదునని లేశ ♦ మాత్రమైన
భయము లేదమ్మ సెలవిచ్చి ♦ బంపుమమ్మ.

లీలా—హా తండ్రీ! నీపల్కులేమియు నాకర్ణరంధ్రము ల బడుటలేదురా, నాయనా, ప్రహ్లాదా! ప్రహ్లాదా!

(మూర్ఛిల్లును.)

ప్ర—(ఆత్మములో) అయ్యో! అయ్యో! అమ్మగారు మూర్ఛితులైనారు. ఇప్పుడేమి చేయనగును? విద్యున్మాక్షీ! నీవీమెకు శైత్యోపచారము లొనర్చి మెల్లగా నంతఃపురమునకు దీసికొనిపొమ్ము.

విద్యు—చిత్తము. (శైత్యోపచారములొనర్చును.)

ప్ర—హా! పరమాత్మా! అవసానకాలమందైనను తనివిదీర నీకు మ్రొక్కుటకు కరయుగబంధనమ్ము లభ్యంతరము పెట్టుచున్నవిగదా?

(4) శరణుశరణటంచునీదు । చరణయుగముగొల్చుచుంటి
పరమకేలకన్నతండ్రి । పరిపాలనజేయుమింక ॥ప॥

(నిష్క్రమింతురు.)

(తెరబడును.)

ద్వితీయరంగము—సభాభవనము.

(ప్రవేశము:-హిరణ్యకశిపుఁడు, శంబరుఁడు, శకుని మొదలగు రాక్షసులు)

హిర—సచివశేఖరులారా! వైరిమార్గానుసారియు, కులద్రోహియు, వివేకశూన్యుఁడునగు, నర్భకుఁడు విబుధోపాయముల జంపించు ప్రియత్న మొకవంక బాధింపుచుండ నేఁడు నామనంబొక దుస్స్వప్నకారణంబున ద్విగుణీకృతమగు కలత వడినది.

శంబ—దేవరా! భుజబలోద్రేకవిజయులరగు తమ కంతభయోద్రేకమగు నాదుస్స్వప్న విశేషము లేవియో విన గోరుచున్నాము.

హిర—శంబరా! వినుటయే కాదు, నిక్కముగా మీ రెల్లరు ప్రతిక్రియ నాలోచింప వలసియే యుండును.

కీర్తన—భూపాలరాగము—చతురశ్ర.

పల్లవి—ఆకర్ణింపుడు ।సచివులార హృద। యాందో
ళంబగు నాదుస్స్వప్నము ॥ఆ॥

అను—లోకాతీతుఁడనగు నాకన్నుల । లోఁగన్పించెను
భీకరవిగ్రహ ॥మా।

మిత్రి॥ ప్రాకారంబుల వరుసగ దాటియు । ప్రళయగర్జన
ము సేయుచునటునిటు । తోఁకాడించుచు పాదఘట్టన
ము । తుళ్ళిపడగ జేయసాగవింతగ ॥నా॥

2. కరములు దీర్ఘము లాకర్ణాంతము । కన్నుల నిప్పులు
గ్రక్కుచుండెడన । శిరమున జూలు, విశాలవక్షమును।
శ్రీకరకరదయుగమాకారంబును।
మిశ్ర॥ నరసింహాకృతిదోచె కేవలము । నరుడుగాడు మృగము
గాదు చూడగ । ధరణిస్థలి మున్నెన్నడెఱుంగము ।
ద్వంద్వరూపసందర్శన చిత్రము ॥అ॥
3. నిమురబోవు నన్ను మేలుకొలిపియు । నీకిపుడెవ్వడు
దిక్కుగురా! యని । గదిమి మీఁదికుఱికి వాడినఖములు।
కంఠనాళ మొడిసిపట్టె గర్భము।
మిశ్ర॥ చనువుజేసి జీరపేర్వు లెడపెడ । జందెముట్లువైచుకొ
నియురక్తము । మోదముతోడ గ్రోలిచాపెనాతని ।
మూర్తిదలుచ భయము దోచుచున్నది ॥అ॥

ముజ్జగంబు గొంకక్కవెట్టుచువచ్చిన ప్రాణప్రియముగా నెంచు వాఁడొంటి మహావీరుని సైతమా భయంకర విగ్రహ మొక్కింత తడవు గజగజ లాడించిన దేనుందును? ఆహా! కాలవైపరీత్యము?

శంబ—దైత్యరాకొందా! నిష్ఠురతోఁ గాంచిన భయంకర విగ్రహము నెంచి యమరింత విచారింపవలయునా? స్వప్న వృత్తాంత మెన్నడైన నిజమగునా? రణాంగణమునవగు నిన్నెదిరించు నంతటి వాఁడీత్రిభువనముల నెందైన గలఁడా?

హిర—శంబరా! ఎన్నఁడెట్టినబోకుము? కాలగతివక్రితనొందిన నెంతటివాఁడైన నేమి? మహాబల సంపన్నుఁడన్మత్సహోదరు మృతికిట్టి కారణమున్నది?

ఉ. వీరుఁడు, ముజ్జగంబులొక ♦ వ్రేల్మికి వచ్చిన దీసిపోనిగం
భీరుఁడు, దేవతాగణము ♦ భీతిల నాకముఁ గెల్చెనా మహా
శూరుఁడు,మత్సహోదరుని♦సూక్ష్మవరాహముగా జెవచ్చిసం
హారముఁ జేసె మున్ను నస ♦ హాయుతనొంటిగఁ బోయిడీకొనన్.

కావున నామనం బప్పటినుండియు నిట్టివిపరీత విఘ్నములకెంత యో ననుమానించుచుందును.

శకుని—దేవా! ధర్మజ పరిపాలితుండవగు నీకెట్టి వారివలన నిసుమంతయైన, హానిచేకూరదిది ముమ్మాటికి నమ్ముఁడు.

హిర—అయిననగుఁగాక! నూనమేనుఁడయుండఁ రాదను విషయమును ప్రకటింపుచున్నవి. నేఁడే మాభాగ్యముల వారికను దయచేయుతేము. కులగురోపదేశమునగాని, నామనంబూరట గల్గునటులఁదోఁచుటలేదు.

(ప్రవేశము:-ప్రస్థానుఁడు, నర్తకిర, మునపాలురు)

5. హరినారాయణ కేశవ । అచ్యుతగోవిందాయని । స్మర
ణజేతు ననవరతము । స్వామి రామకృష్ణ వందుని ॥స॥

హిర—(ఆశ్చర్యమభినయించి కోపముతో) ఏమేమీ! ఈనిర్భాగ్యులింకను సజీవులై నాకన్నులయెదుట గానబడుచున్నారా! ఓరీవజ్రకంఠా! ఏమిజరిగినది? మీరేమేమిశిక్ష లొనరించిరి?

వజ్ర—దేవా! తమయాజ్ఞానుసారముగా నీయర్భకుల కరముల కురితాళ్ళు బంధించి ఘోరారణ్యప్రాంతమునకు గొనిపోతిమి.

హిర—తరువాత!

వజ్రి—తరువాత నో ప్రభూ! వధ్యశిలనెక్కించి పదునుగల కత్తులతో నిఱువంకల దెగవేయ శిరమూడకపోవుటయేగాక మాచేతిఖడ్గము లటునిటు చెదరెను.

హిర—ఓరా! పదునుగలకత్తులే మొక్కవోయెనా? తరువాత, తరువాత.

వజ్రి—అటుపిమ్మటనో మహారాజా! కసిదీరక మేమెంతమో, బిక్కమొగముల లేనికోపము దెచ్చుకొని బాలునెత్తి పర్వతశిఖాగ్రభాగమునుండి క్రిందికి దొర్లించియు, ప్రళయాగ్నిలోవైచియు మదపుటేనుగుల పాదములచే మట్టించియు, మహాసముద్రమధ్యమున బడద్రోసియు, వివిధోపాయములను శక్తివంచనలేక బ్రయత్నించి విఫలులైనారము. అన్నిటికిని నారాయణశబ్దమొక్కటిదక్క మారాపుసరికనా లేశమాత్రమైన చలింపకుండుట తుదకు మాప్రాణములువిసిగి వీనిని దేవరవారిసన్నిధికి దీసుకొనివచ్చితిమి.

హిర—(ఆలోచనమభినయించి) ఏమేమీ! ఇంక వీని నే యుపాయమునజంపింతును? (కోపముతో) ఏమిరా! కులద్రోహీ! నీకు మరణాంతము నాచేతులలోనున్నది గాబోలును మరల దిరిగి వచ్చినావు. ఏరా మాట్లాడవు?

ప్ర—తండ్రీ! జననమరణములొకరివశమగునా? మృత్యువాసన్నమైనగాని, బలాతిరేకముగా నొకరినొకరు హింసింపగలరా? ప్రకృతికి లోబడి నీవెంతయు వినకున్నావు?

చ. వినుముసమస్తజీవులకు • విశ్వమయుండు; పరాత్పరుండు; క
ర్తన; నొకప్రాణికొండయిన • దైవమెఱుంగమిహింసజేయన
వ్వనితరమౌను; ప్రాకృతులు • వక్కఁడుమాటలుగట్టిపెట్టుమో
జనకదురాగ్రహంబుడిగి • చక్రిపదంబులనాశ్రయింపుమీ.

భూతభవిష్యద్వర్తమానములనైన భగవదాదేశములేని యంశమిసుమంతయైననుండదు. అజ్ఞానాంధకారమునబడి వెదకులాడు మనబోంట్లకా నిగమగోచరుచర్య లగమ్యములు.

హిర—(కోపముతో) ఓరీ! దైత్యకులాంతకా! నీచార్భకా! మేరమీఱిన నీవాగ్ధోరణినిక గట్టిపెట్టెదవా? లేదా?

ప్రి—(నవ్వుచు) జనకా! నీవెంత యవివేకమున బడుచుంటివి? హితముగోరి సేవచించుపలుక్కు లిసుమంతయు నీకు రుచింపకున్నవిదేమి ప్రారబ్ధము?

కీర్తన—సావేరిరాగము—చతురశ్రి.

పల్లవి—జనకా! యీప్రారబ్ధమే । లానను గన్న ॥జ॥

అను—మనవినిపాలించి । మాధవునర్చించు ॥జ॥

చర॥ తనువశాశ్వతమయ్యు । దారాపుత్రులుహితులు
గనగబుణస్థులు । కల్లసంసారము

మిత్రి—జననమరణసూత్రిమొందుడప్పుడు । సకలజీవకోటి సరసిబ్రోచెదు । ఘనుడునిర్వికారనిర్వికల్పుడు । కర్మరహితుడౌకడుగలడునిత్యుడు ॥జ॥

(2) జగము సర్వము మాయ । శత్రిపులాస్గరు । త్రిగుణ
ములకుజంట । దిరుగుచునుందురు

మిశ్ర॥ పగబూనియు వెనువెంటనుదగిలియు । భక్తి ని
ద్రోసియు నిద్దురముంచియు । భగవంతుని దెలియంగఁగోరి
నను । పాపపుంజముల నెత్తి కిదెత్తురు ॥జ॥

కావున నాయుడులాలించి భగవదపరాధము సేయవలదు.

హిర—ఓరోరి! వంశకళంకా! నీవునాకు హితముమ
ప్పుచుంటివా? నీజీవితమెంత బలవత్తర మైనదిరా?

సీ. గరళమిచ్చిననీవు ♦ కడతేరకున్నావు
ప్రహ్లా— శేషతల్పుండు ♦ రక్షింపకున్న
హిర—పర్వతాగ్రమునుండి ♦ బడద్రోసినను బోవు
ప్రహ్లా— గిరిధరుండెపుడునా ♦ దరముజూపు
హిర—జలధిలోద్రోయంగ ♦ జావకున్నావురా
ప్రహ్లా— మత్స్యావతారుండు ♦ మఱువబోడు
హిర—ఆయుధంబుల గూల ♦ వైతివి రామూర్ఖ
ప్రహ్లా— చక్రధారుడు నాకు ♦ శరణుగాదె
హిర—తే. గీ. సాధనము లేదె! నీచావు ♦ జరుగదనుచు
దలచుచున్నావు గాబోలు ♦ కులకళంక
ప్రహ్లా— సాధనము లేదు; నేజావ ♦ జాటిచెప్ప
వాడ; ముమ్మాటికిని దైవ ♦ మేదనుండు.

హిర—(కోపముతో) ఛీ! మూఢాత్మా! నీవధోపాయ
మునకు సాధనమే లేదా? నిన్ననవరతము రక్షించునందు వా
దేవుడెడిరా? ఎచ్చోట దాగియున్నాడురా?

ప్ర—తండ్రీ! సర్వాంతర్యామియగు భగవంతునికొక ప్రదేశము నిర్దిష్టమైయుండునా?

కీర్తన—మోహనరాగం—చతురశ్ర

పల్లవి—వినుమయ్యా! వేద । వేద్యునిచరితము ॥వి॥

అను—ఘనుడగు శ్రీధరు । కథలమృతమగు ॥వి॥

చర—కలడీభూమిని । కలడామింటిని । కలడంభోనిధి ।
కలడన్నింటిని । నలుదిశలందున । నారాయణుడే ।
బలవంతుండగు । ప్రభునని తెలియుము ॥వి॥

2. అండపిండ బ్ర । హ్మాండమయుండత । డుండని తావే
యుండదు తెలియగ । చండశాసనుడ। ఖండుడు సర్వము
నిండిజగంబుల । మెండుగనేలును ॥వి॥

(3) కలహాముమానియు । కమలాక్షుని పద । కంజములకు
నమస్కారమొనర్పుము । తలపుముహరితో । తగవే
లనునా । తండ్రి తనయుని । దయఁబాలింపుము ॥వి॥

హిర—(కోపముతో గద్దియనుండి ప్రహ్లాదుని జుట్టు పట్టుకొని గద్దించి) ఓరోరి! నీచమతీ! నీదేవుడన్ని తావులను గలడంటరా! అయిన నాసభాస్థానమందంతటను నిండియున్నాడందువా! ఏదీ, చూపుమీస్తంభమున జూపుము (గదతో స్తంభమును మోదుచు)

జైలాగ్ కీర్తన—తోడిరాగం—త్రిశ్ర.

పల్లవి—శౌరియేడిరా! సభా। స్తంభమునందున్నాడా ॥శౌ॥

అను—క్రూరుడు, నియతిచోరు, దురా । చారు, నిందుజూ
పెట్టుము ॥శౌ॥

చర॥ మదమత్తు డింబకయను । సదనంబున కంపువాడ।
కదలవేమి? చక్రిగిక్రి। గాచునేమొ జూతుసింక ॥శా॥
ప్రహ్లా—పల్లవి—కరుణజూడుమా నా। కన్నతండ్రి
మ్రొక్కుచుంటి ॥క॥
అను—శిరమిదె ఖండించుమింక।శ్రీహరి నగ్గాడబోకు॥క॥
చర॥ భువనములన్నియు నిండిన। పుణ్యాత్ముడేల సభా
భవనంబున స్తంభమంద।ప్రత్యక్షముగాకయుండు॥క॥
హిర- ఏడిర! నీదేవుడేడి। యెచ్చటనుండె జూపుమోరి
చూడుమర్భకా! తుంటవా।వీడుమింక పేరలబోకు॥శా॥

(స్తంభము ఫెళఫెళ మనును)

ప్రహ్లా—అదుగో! నాతండ్రిడుగో। యగుపడుచున్నాడదుగో।
విడిచిపెట్టబోకు మింక నన్ను। విశ్వంభర! జయజయజయ॥క

(జయ జయ ధ్వనులతో నృసింహమూర్తి ప్రత్యక్షమగును)

నృసిం—(క్రోధముతో) ఓరోరి! క్రూరనక్తంచరా! ఏదిరా! నీసాహసమిక నాకడజూపుము.

(మీదికురుకును)

హిర—(స్వగతమున) ఆహా! స్వప్నవృత్తాంత మిట్టుల పరిణమించినది. నిరంతరభగవదారాధనా తత్పరుడగు బాలుని కెగ్గుతలంప తుదకు నాగతి యిట్లయ్యెను.

నృసిం— (హిరణ్యకశిపుని పొట్ట జీరి రక్తమును ద్రావును)

(ప్రవేశము:-లీలావతి)

మహాత్మా! రక్షింపుము! రక్షింపు! (నమస్కరించును)

ప్రహ్లా—(కరములుమోడ్చి) దేవాదిదేవా! నృశింహావతారా! ధన్యోస్మి! ధన్యోస్మి!

కీర్తన—మోహనరాగం—తిశ్ర.

పల్లవి—దయను శాంతిగనుమయ్యా। దైవమా! నృసింహావమా ॥ద॥

అను—భయము దీర్చి బ్రోవుమయ్యా। భక్తవరద! బ్రిణుతులిడుదు ॥ద॥

చర॥ నిన్ను దెలియదరము గాదు। నిఖలజనుల కాధారివి। సన్నుతాంగ! క్రోధంబుప।సంహరింప బ్రార్థింతును॥ద॥

2\. దుర్మదమున దెలియలేక। ద్రోహామొనర్చెను జనకుడు। కర్మసూత్రమది తప్పదు। గాదెయెంతవాడైన ॥ద॥

3\. ఘనమోక్షంబిచ్చి మమ్ము। గాపాడుమటంచు నిన్ను! వినయమొప్పగొల్చుచుంటి। ననవరతము దేవదేవ ॥ద॥

నృసిం—ఓయీ! ప్రహ్లాదా! నీభక్తికి కడుమెచ్చితిని. పాపాత్ముడగు నీతండ్రి మృతికి వగవకుము. నాచే మరణించుటచేత వానికి కైవల్య ప్రాప్తిగలిగినది. కొలది దినములలో నీకు నాసాన్నిధ్యము చేకూరునంతవరకు నిహసుఖంబుల ననుభవింపుము. నీకువలయు వరములను గోరుమిచ్చెద.

ప్ర—దేవా! తమయనుగ్రహముకన్న నాకు మరొం డువరమేల? అయిన నిట్లగుగాక!

తే. గీ. ధరణిసస్యసమృద్ధిమై ♦ దనరుగాక
ధర్మమార్గంబు వాల్గుచు ♦ దనరుగాక
ప్రభుప్రజనులను బిక్షల ♦ బాతిగనుచు
నుల్లముల దైవభక్తి న ♦ ర్పిల్లుగాక.

నృసిం—తథాస్తు!

(అందఱు నిష్క్రమింతురు)

(తెరపడును)

సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



---

శ్రీరామాప్రెస్, రాజమండ్రి—1931.

# సత్యహరిశ్చంద్ర
# భజనకీర్తనలు.

నాటకరూపముగా వ్రాయబడిన చక్కనికీర్తనలతో నిండియున్నది. హరిశ్చంద్రుని సత్యవాక్యపరిపాలనము, చంద్రమతి పాతివ్రత్యమహాత్మ్యము, నక్షత్రకునిబాధలు మున్నగుకీర్తనలు చదువుచున్నకొలది విచారముదయింపకమానదు. కొద్దిప్రతులుమాత్రమే యున్నవి. వెల 0—12—0

## ప్రకటన.

---

ఈపుస్తకములుగవర్నమెంటువారికాపీరైటు యాక్టు రూల్సుప్రకారం నాకు కాపీరైటు హక్కు కలిగియున్నవి. గ్రంథమును అంతగాని, కొంతగాని, ఇందులోనున్న కీర్తనలుగాని యెవరైనా ముద్రించుకొన్నయెడల వారిపైన క్రిమినలు, సివిలు చర్యలు జరుపబడును.

ఇట్లు,
గ్రంథకర్త.

వలయువారు,—బళ్ళ రామరాజు, తాపేశ్వరం,
రామచంద్రపురం తాలూకా, గోదావరిజిల్లా.

# నోటీసు.

లిఖితరూపకమైన నాయనుమతిలేని దిగువఁగ్రంథముల నెవ్వరు ముద్రింపఁగూడదు.

| | |
|---|---|
| జా న్మోహననాటకము | 0—8—0 |
| లంకాదహనము డిటో | 0—8—0 |
| కుశలవ భజనకీర్తనలు. | 0—8—0 |
| రామదాసు భజనకీర్తనలు. | 0—10—0 |
| సత్యహరిశ్చంద్ర భజనకీర్తనలు. | 0—12—0 |

వలయువారు:—

బళ్ల రామరాజు,

తాపేశ్వరం, రామచంద్రపురము తాలూకా

తూర్పు గోదావరిజిల్లా.

అని వ్రాయవలయును.